బెజవాడ (విజయవాటికి) శ్రీ కనకదుర్గా దేవి వైభవము

రచన . గౌరీ విజయప్రకాష్

ప్రథమ ముద్రణ అక్టోబరు 2001

ముఖచిత్రము గిరిధర్

ముద్రణ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్, గాంధీనగర్,
విజయవాడ-3

డి టి పి విశ్వ డిజిటల్స్
డిజైనర్స్ అండ్ సొల్యూషన్స్
అన్నపూర్ణా దేవీ స్ట్రీట్, గాంధీనగర్
విజయవాడ-3

ప్రతులకు శ్రీ సరస్వతి పబ్లికేషన్స్
తాడంకివారి వీధి, సత్యనారాయణ పురం
విజయవాడ 520 011

వెల *రూ. 20-00*








## శ్రీ చక్రము

### ఉద్ధారము

బిన్దు త్రికోణవసుకోణదశారయుగ్మ
మన్వస్రనాగదళషోడశ పత్రయుక్తమ్
వృత్తత్రయం చ ధరణీసదనత్రయం
శ్రీ చక్రరాజ ఉదితః పరదేవతాయాః








# బెజవాడ (విజయవాటిక) శ్రీ కనకదుర్గా దేవి వైభవము

అమ్మలగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలపె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడి పుచ్చిన యమ్మ తన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యీ వుత మహత్త్వ కవిత్వ పటిత్వ సంపదల్

ఈ విధంగా ప్రతినిత్యం వేలాదిమంది భక్తులూ, యాత్రికులూ తీర్థప్రజలు తరలివచ్చి విజయవాడ ఇంద్రకీలాద్రిపై వెలసివున్న శ్రీ కనకదుర్గమ్మని ప్రార్థించి, పూజా పునస్కారాలతో సేవించి, భక్తి ప్రపత్తులతో పూజిస్తూ ఆ తల్లి ఆశీస్సులు పొందుతున్నారు ప్రతివారూ తమ తమ ఆయురారోగ్య ఐశ్వర్య కుటుంబ, సంతాన, సౌభాగ్య క్షేమాభివృద్ధికోసం యుగయుగాలుగా శ్రీ కనకదుర్గాదేవిని దర్శించి తమ మొక్కుబడులను చెల్లించుకుంటున్నారు దేవిని అనేక విధాలుగా కీర్తించి, ప్రార్థించి ఆ తల్లి అనుగ్రహన్ని పొందుతున్నారు

ఈ ఆలయాన్ని శ్రీ దుర్గామల్లేశ్వర స్వామివార్ల దేవాలయములనీ, శ్రీ దుర్గామల్లేశ్వర స్వామివార్ల దేవస్థాన'మనీ ప్రస్తుతిస్తున్నారు ప్రతియేటా ఇక్కడ అమ్మవారి దసరా 'నవరాత్రి మహోత్సవాలు' అత్యంత వైభవంగా, వేడుకగా, కన్నుల పండువుగా, భక్త జనహృదయ రంజకంగా జరుగుతుంటాయి ఆంధ్రప్రదేశ్‌నించే కాక, దేశం నలుమూలలనుండీ లక్షలాది యాత్రికులూ, భక్తులూ యీ నవరాత్రి పర్వదినాల్లో విశేషాలంకార శోభితయైన యీ తల్లిని దర్శించి, పూజించి, భక్తి పారవశ్యంతో పులకించిపోతుంటారు

ఆంధ్రప్రదేశ్‌లోవున్న అసంఖ్యాక దేవస్థానాల్లో అత్యధిక వార్షికాదాయం పొందుతున్నది తిరుపతి-తిరుమలలో వెలసిన శ్రీ వేంకటేశ్వర స్వామివారుకాగా, ఆ తర్వాత అత్యధిక వార్షికాదాయం విజయవాడ ఇంద్రకీలాద్రిపై వెలసిన శ్రీ కనకదుర్గాదేవి వారే కావడం గమనార్హం

విజయవాడ నగరం భౌగోళికంగా చూస్తే ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డున వుంది ఇటు తూర్పునించి పడమరకూ అటు ఉత్తరంనించి దక్షిణానికీ ప్రయాణించే రైలుమార్గాలకి ముఖ్యకూడలి విజయవాడ రైల్వేజంక్షన్ ఆసియా ఖండంలోనే అతిపెద్దదైన పండిట్ నెహ్రూ బస్‌స్టేషన్ ఇక్కడే వుంది భక్తులూ,తీర్థయాత్రికులూ పరమ పావనమైనవిగా భావించే పన్నెండు నదీ పుష్కరాలలో ఒకటైన కృష్ణవేణీ నది అమ్మవారు వెలసిన ఇంద్రకీలాద్రి పర్వతం దక్షిణ భాగంగా పడమట నుండి తూర్పుకి ప్రవహిస్తూ సాగరతీరంలో కలుస్తోంది అంతేగాక, రాజకీయ, సాంస్కృతిక, వ్యాపార, విద్యారంగాలకి విజయవాడ ప్రముఖస్థానం వహిస్తోంది అయితే వీటన్నింటి చేరికవల్ల కనకదుర్గమ్మకి ప్రాశస్త్యం వచ్చిందని ఎవరైనా భావిస్తే వారు పొరపడ్డారని ఘంటాపదంగా చెప్పవచ్చు! అమ్మవారు స్వయంభూవై ఇక్కడ వెలసినందునే,ఆమె శక్తి మహత్తుల చేతనే విజయవాడ నేడింతటి ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నదనేది నిర్వివాదాంశం



దీనికి కారణం ఇక్కడి అమ్మవారుగానీ, మల్లేశ్వర దేవాలయంలోవున్న శ్రీ అయ్యవారుగానీ ఆగమశాస్త్రవేద_శాస్త్రాల ఆధారంగా ప్రతిష్టించిన విగ్రహమూర్తులు కావు శ్రీ అమ్మవారూ, అయ్యవారూ స్వయంగా వెలిశారు ఇందుకెన్నో చారిత్రిక, పౌరాణిక ఆధారాలున్నాయి రాజాధిరాజులు ప్రతిష్టించిన శిలాశాసనాలూ వున్నాయి ఇలా అమ్మవారూ, అయ్యవారూ తమ భక్తుల ప్రార్థన మేరకు స్వయంగా ఇక్కడ శక్తి స్వరూపులై వెలిసినందునే కోట్లాది భక్తులు యీ క్షేత్రానికి ఆకర్షించబడుతున్నారు అట్టి యాత్రికుల రాకచేతనే ఒకప్పటి 'విజయవాటిక' నేడు విజయవాడ నగరంగా దిన దిన ప్రవర్ధమానమైంది

ఇక్కడ, ఇంకో ముఖ్యవిశేషం ఏమిటంటే 'పరాశక్తి' అవతారమైన దుర్గాదేవికి ప్రాముఖ్యత లభించడం మనదేశంలో అష్టాదశ శక్తిపీఠాలున్నాయి ఈ 18 శక్తి పీఠాల్లో 4 మన ఆంధ్ర రాష్ట్రంలో వున్నాయి అవి

1 మహబూబ్ నగర్ జిల్లా ఆలంపూర్‌లో జోగులాంబ (కర్నూలుకి 20 కి మీ)

2 శ్రీశైలంలో భ్రమరాంభిక

3 తూర్పుగోదావరి జిల్లా పీఠాపురంలో పురుహూతిక

4 తూర్పు గోదావరి జిల్లా ద్రాక్షారామంలో దాక్షాయణి అనే పేర్లతో లోక ప్రసిద్ధమయ్యాయి

ఈ శక్తిపీఠాలకంటే మిన్నగా విజయవాడలో వెలసిన శ్రీ కనకదుర్గాదేవి విరాజిల్లుతోంది ఇక్కడ వెలసిన దుర్గామాతకి యింతటి ప్రాశస్త్యం లభించడానికి ఎన్నో పౌరాణిక చారిత్రిక కారణాలున్నాయి వాటిని సంపూర్ణంగా తెలుసుకున్నప్పుడే యీ తల్లి మహత్మ్యం అర్థమవుతుంది

శ్రీ కనకదుర్గాదేవిని 'ముగురమ్మల మూలపుటమ్మ' అని కీర్తిస్తారు అంటే ముగ్గురు 'అమ్మల'కి మూలధార శక్తి ఈవిడే అయితే ఆ ముగ్గురు తల్లులు ఎవరు? లక్ష్మీ,సరస్వతి దుర్గ అనే మూడు పేర్లతో మనం నిత్యం ఆరాధించే త్రిమూర్తి స్వరూపిణిలే, త్రిశక్తి స్వరూపిణిలే ఆ ముగ్గురు మాతలు

శ్రీ లక్ష్మీదేవి అష్టఐయిశ్వర్య భోగభాగ్య సంపత్ప్రదాయిని ఈ తల్లిని మనస్ఫూర్తిగా కొలిచిన వారికి సకల సంపద, సంతాన సౌభాగ్యాలు ప్రసాదిస్తుంది

శ్రీ సరస్వతీదేవి విద్యా విజ్ఞాన ప్రదాయిని ఈ తల్లిని త్రికరణ శుద్ధిగా ఆరాధించిన వారికి అఖండ విద్య, విజ్ఞాన, జ్ఞానములు ప్రసాదిస్తుంది శ్రీ దుర్గాదేవి శతృంజయ రూపిణి సకల శక్తి స్వరూపిణి ఈ తల్లిని మనసా వాచా కర్మణా నమ్మి ప్రార్ధించిన వారికి సర్వకార్య జయం, శతృవిజయం సిద్ధిస్తుంది

ఈ త్రిశక్తి స్త్రీ స్వరూపిణులకే మూలధారమైనదే జగన్మాత, ఆదిపరాశక్తి ఈ సకల చరాచర జీవ కోటికే ఆదితల్లి ఈ పరాశక్తి

అయితే యీ పరాశక్తి ఎవరు? ఈవిడ లక్ష్మీ,సరస్వతి,దుర్గ అనేపేర్లతో త్రిశక్తి స్వరూపిణులుగా ఎందుకు అవతరించిది?

ఈవిడే త్రిశక్తి స్వరూపిణిగా ఒకనాడు విజయవాటికగా ప్రసిద్ధిపొంది నేడు విజయవాడగా పిలవబడుతున్న యీ నగరంలో ఇంద్రకీలాద్రి పర్వతంపై కనకదుర్గగా ఎందుకు అవతరించింది? ఈ పర్వతానికి ఇంద్రకీలాద్రి అనే పేరు ఎలా వచ్చింది? ఈ ప్రశ్నలన్నింటికీ పౌరాణిక,చారిత్రక గాధలే సమాధానం చెబుతున్నాయి ఈ అత్యద్భుత కధనాన్ని వివరంగా తెలుసుకుందాం



# ఆది పరాశక్తి ప్రాదుర్భావం

ఈ సృష్టికి పూర్వం యుగములు, జగములు అనేవి లేనేలేవు విశాల విశ్వమంతా శూన్యంగా, తేజోవంతమైన ప్రకాశంగా వుండేది ఈ విశాల విశ్వతేజోస్వరూపమే నిరాకారుడైన పరమేశ్వరుడు అంటే శూన్యంగా తేజస్సురూపంగా ప్రకాశిస్తున్న వెలుగే ఆయన ఆకారంగానీ, అప్పటికి ఆయనకి ప్రత్యేకంగా మనం పూజించే ఆకారంవంటిది లేనే లేదు

ఆ మహాశక్తి స్వరూపుడికి 'సృష్టి' ఆరంభించాలన్న సంకల్పం కలిగింది అయితే సృష్టిధర్మం ప్రకారం పురుషుడు కర్త అయితే ప్రకృతి క్రియాస్వరూపిణి ఉత్పత్తి కారిణి కానీ ఆదిపురుషుడికే ఒక ఆకారము లేదు అప్పటికింకా సృష్టి ప్రారంభం కాలేదు మరి సృష్టిఉత్పత్తికి ప్రకృతిరూపిణి అయిన స్త్రీ ఎలా లభిస్తుంది?

అందుచేత విశ్వరూపుడైన పరమేశ్వరుడు తన సంకల్పంచేతనే తనలో సగభాగాన్ని ప్రకృతిస్వరూపిణిగా, స్త్రీశక్తి స్వరూపిణిగా మార్చుకున్నాడు అలా తనలో అర్ధభాగాన్ని 'నారీ'శక్తిగా మార్చుకోవడం చేతనే ఆయన 'అర్ధనారీశ్వరుడు' అయ్యాడు

అలా పరమేశ్వరునిలో సగభాగం స్త్రీశక్తిస్వరూపంగా మారడంచేత ఆ శక్తి 'పరమేశ్వరి' అయింది ఆవిడ తన సగభాగాన్ని వేరుచేసుకోకుండా పరమేశ్వరునితో కల్సి ఏకస్వరూపంగా వుండటంచేత, ఆ పరమేశ్వరుని శక్తి ఆధీనంలోనే వుండటంచేత, ఆవిడకి లభించిన స్త్రీశక్తి పరుడైన పరమేశ్వరుని నుండి లభించినదవడంచేత ఆవిడ 'పరాశక్తి' అయింది

అంటే, ఈవిడ స్త్రీశక్తి స్వరూపిణీ, ప్రకృతిరూపిణీ, ఉత్పత్తికారిణీ అయినప్పటికీ ఈమెకి ఈ శక్తి సహజంగానూ అర్ధనారీశ్వరిగానేకాక, మిగతా సగభాగమైన పరమేశ్వరుని శక్తియే యీమె శక్తికి కారణం, ఆధారం అవడంచేత యీవిడ 'పరాశక్తి' అయింది

ఇలా పరమేశ్వరుడు తన విశ్వవిరాట్ స్వరూపంలో సగభాగాన్ని స్త్రీతత్వం చేసుకుని, తన సంకల్పంచేత ఆమెకి సృష్టికార్యాన్ని ప్రసాదించాడు

అలా పరమేశ్వర పురుషసంయోగంతో ఆ స్త్రీశక్తి స్వరూపం చేరినప్పుడు వారి స్వేదమునుండి మహాజలం ముందుగా రూపొందింది ఆ జలమునందు ఆ స్త్రీ పురుషుల సంకల్ప శక్తిచేత విష్ణువు ఉద్భవించాడు అతడు పుట్టుకతోనే చతుర్భుజాలతో జన్మించాడు. అతడు నివశించడానికి ఆ అనంత జలరాశిలో ఆదిశేషుడు ప్రభవించాడు

విష్ణువు ఆ ఆదిశేషుడి మీద వశించి తానెవరో, తన పుట్టుకకి కారణ,కారకులెవరో తెల్సుకోడానికి చుట్టూ పరికించాడు ఆయనకి తన చుట్టూ అనంతజలరాశీ, దాన్ని ఆవరించుకుని ప్రకాశిస్తున్న మహాతేజమూ తప్ప మరేమీ కన్పించలేదు

విష్ణువు తన ఉద్భవానికి కారణమైన శక్తి ఏదో తెల్సుకోడానికి ధ్యానంలో యోగనిద్రలో మునిగిపోయాడు అలా విష్ణువు అనేక సంవత్సరాలు సాగించిన యోగతపస్సు ప్రభావంచేత ఆయన నాభినుండి ఒక 'కాండము' ఉద్భవించి అది అనంతంగా పెరిగి పెరిగి దానిపైన ఒక కమలము వికసించింది ఆ కమలమునందు బ్రహ్మ ఉద్భవించాడు కమలమునందు ప్రభవించాడు కాబట్టి బ్రహ్మని కమలనాభుడు అంటారు



అలాగే ఆదిశక్తి సంకల్పముచేత ఆమె నుండి ఉద్భవించాడు కాబట్టి వారిద్దరికీ మూల కారకుడు పరమేశ్వరుడైనందున ఇద్దరూ సోదరీ, సోదరుల వరుస అవుతారు కాబట్టి పరాశక్తిని 'విష్ణుసహోదరి'గా కీర్తిస్తారు

ఇలా బ్రహ్మ, విష్ణు అనేకవేల సంవత్సరాలపాటు తపస్సు చేశాక ఆదిపరాశక్తి అష్టభుజాలతో, అనేకానేక శక్త్యాయుధాలతో బ్రహ్మాండమైన తేజస్సుతో సాకారంగా వారిముందు ప్రత్యక్షమైంది వారికి ఆవిడ ఇలా చెప్పింది

'ఈ విశ్వవిరాట్ మహాస్వరూపుడే సృష్టి, స్థితి, లయ కారకుడైన ఆదిపురుషుడు పరమేశ్వరుడు ఆయన తేజోస్వరూపుడు నిరాకారుడు అయినా ఇచ్ఛాసంకల్ప రూపాలు ధరించగల శక్తి గలవాడు ఆయన సంకల్పంచేత ఆయనలో సగభాగం నా ఈ స్త్రీరూపం, పరమేశ్వరి రూపం దాల్చింది నేను అర్ధనారీశ్వరినీ ఉత్పత్తికారిణినీ అయినప్పటికీ నా యీ శక్తియావత్తూ పరమేశ్వరునిదే అందుచేత నేను ఆయన సేవికను ఆయనకి సృష్టి సంకల్పం కలిగినప్పుడు ఆయననుండి నేనూ, నాతోపాటు మా ఇరువురి సంకల్పంచేత విష్ణువు ప్రభవించాము కనుక విష్ణువు నా సోదరుడు ఆ విష్ణువు నాతో సమానంగా పుట్టినందున ఆయనలో నేను నాభియందు ప్రకృతిస్వరూపంగా నివసించడంచేత నా శక్తిసంకల్పంచేత విష్ణువు నాభినుండి కమలము ఉద్భవించి అందు బ్రహ్మ ప్రభవించాడు ఇందుచేత నేను మీ ఇరువురికీ మాతృసమానురాలిని నా యీ మాతృత్వానికి కారకుడైన పురుషుడు పరమేశ్వరుడు యీ జగత్తంతటికీ తండ్రి జగత్పిత నేను జగన్మాతని ' అని ప్రకటించింది ఆదిపరాశక్తి

బ్రహ్మ, విష్ణువులు ఆ పరమేశ్వరిని అనేక విధాల స్తోత్రం చేసి 'అయితే తల్లీ, మా యీ పుట్టుకకీ, మీ ఆదిదంపతుల సంకల్పానికి హేతువు ఏమిటి?' అనడిగారు వినయంగా

'సృష్టి స్థితి ఇది పరమేశ్వరుని సంకల్పం ఈ సంకల్పాన్ని కార్యరూపం చెయ్యడానికే ఆయన నన్నూ నాద్వారా మిమ్మల్నీ సృష్టించాడు బ్రహ్మా! నీకు సృష్టికార్యాన్ని అందుకు అవసరమైన శక్తి సామర్థ్యాలనీ ప్రసాదిస్తున్నాను ఆకాశము, అగ్ని, వాయువు, జలము, పృథ్వీ యీ అయిదూ పంచభూతములు వీటినీ వీటితో పాటు లోకాలు, సముద్రాలూ, పర్వతాలూ, సూర్యచంద్రులూ, నక్షత్రాలూ, ఆయా లోకాల్లో నివసించడానికి అవసరమైన సమస్త జీవజాలాన్నీ సృష్టించే కార్యభారం నీది ఇకనుండీ నీవు సృష్టికర్తగా పిలువబడతావు, ' అని ఆదిశక్తి చెప్పగా బ్రహ్మ సంతోషించి, వినమ్రతతో నమస్కరించి 'మీ సంకల్పాన్ని నా శక్తిమేరకు నెరవేరుస్తాను తల్లీ' అని విన్నవించాడు

'విష్ణూ స్థితి కార్యభారం నీది బ్రహ్మసృష్టించిన చరాచర జగత్తునంతటినీ పోషించివృద్ధి నొందించడం నీ బాధ్యత ఇట్టి కార్యమునకు అవసరమైన 'స్థితి' శక్తిని నీకు ప్రసాదిస్తున్నాను ఇకనుండీ నీవు స్థితి కారకుడిగా పిలువబడతావు సృష్టిని రక్షించే భారముకూడా నీదే అయినప్పటికీ అవసరాన్ని బట్టి నేను ప్రత్యక్షమై నీకు సహకరిస్తాను మీ ఇద్దరి సృష్టి, స్థితి కర్తవ్యాలను నేను పర్యవేక్షిస్తుంటాను ' అని ఆదిశక్తి చెప్పగా విష్ణువు చేతులు జోడించి 'సంతోషం సోదరీ నీ ఆదేశానుసారం నా కర్తవ్యాన్ని నిరంతరాయంగా నెరవేరుస్తుంటాను ' అని విన్నవించాడు ఆదిపరాశక్తి వారికి శుభాకాంక్షలు తెలిపింది వారిరువురూ ఆ దేవిని కీర్తిస్తూ అనేక విధాలుగా జయజయనాదాలూ, గానాలూ చేశారు ఆ జగన్మాత వారిని ఆశీర్వదించి అంతర్ధానమైంది






ఇక, జగన్మాత ఆదేశానుసారం బ్రహ్మ సృష్టి కార్యక్రమానికి శ్రీకారం చుట్టాడు ముందుగా ఆయన మహాశూన్యంలో ఆకాశాన్నీ వాటికి ఆలంబనగా సూర్యచంద్రులనీ, నక్షత్రాలనీ సృష్టించాడు ఆ నక్షత్రాలనీ మండలాలుగా విభజించి నాలుగు దిక్కులను, అష్టదిశలను ఏర్పరిచాడు అనంతరం పధ్నాలుగు లోకాలను సృష్టించి వాటిలో వాయువు, అగ్ని, జలము సృష్టించాడు జలముచేత సముద్రాలు, నదులు సృష్టించబడ్డాయి అగ్ని ఆధారంగా పర్వతాలూ చెట్లూ, చేమలూ సృష్టించబడ్డాయి వాటికి వాయువు ద్వారా చలన, జీవశక్తులు సమకూర్చబడ్డాయి అనంతరం ఆయాలోకాల్లో నివశించడానికి ఆకారరూపులు సృష్టించబడ్డారు వీరు మానవ, దానవ, దైవ ఆకారాల్లో వివిధ వర్ణాలుగా సృష్టించబడినప్పటికీ అప్పటికింకా త్రిగుణములైన సత్త్వరజోస్తమో గుణాలు సృష్టి జరగనందున అన్ని జీవులూ, అన్ని వర్ణాలూ కలిసి మెలిసి అన్యోన్యంగా సహజీవనం చేస్తుండేవారు

ఇలా బ్రహ్మ తన కర్తవ్యానుసారం నిరంతర సృష్టికార్యం నిర్వహిస్తూనే వున్నాడు విష్ణువు వీరందరికీ ఆహారాన్ని సమకూర్చడం, వారిని పోషించిపెంచడం, వృద్ధి చెయ్యడం నిరంతరాయంగా జరుపుతున్నాడు

ఇలా అసంఖ్యాకంగా పుట్టిన సృష్టితో లోకాలన్నీ నిండిపోయాయి బ్రహ్మ తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూనే ఇలా లోకాలన్నీ నిండిపోయినందున, పుట్టినవారికి నాశనం లేనందున కొత్తగా పుట్టే జీవులని ఎక్కడ వుంచాలో తోచక తల్లడిల్లిపోయాడు

ఇలాగే విష్ణువుకూడా నిరంతరం పుడుతున్న జీవులకి పోషకశక్తిని సమకూర్చలేక సతమతమై పోయాడు అప్పుడు బ్రహ్మ, విష్ణువులిద్దరూకల్సి జగన్మాతని ప్రార్థించారు ఆవిడ ప్రత్యక్షమై 'ఏమిటి మీ కోరికలు?' అనడిగింది

'తల్లీ,మీ ఆదేశానుసారం మేం నిర్వహిస్తున్న కర్తవ్యం నిరాటంకంగా కొనసాగుతున్నప్పటికీ ఇలా పుట్టినజీవులతో లోకాలన్నీ నిండిపోయాయి జీవులకి నాశనం లేనందున వాటిని పోషించడం, కొత్త సృష్టికి చోటు కల్పించడం మా శక్తిసామర్థ్యాలకు మించినకార్యం అవుతోంది కనుక యీ సృష్టిని నాశనం చేసేందుకు ఒక 'లయకారకుడిని' మాకు తోడుగా ప్రసాదించు మమ్మల్ని అనుగ్రహించు ' అని ప్రార్థించారు బ్రహ్మ, విష్ణువులు

జగన్మాత వారిపరిస్థితికి జాలిపడి, కరుణించి 'నేనూ, మీరూ, యీ సృష్టికంతటికీ మూల కారకుడు పరమేశ్వరుడు సృష్టికారకుడే దానిని ఉపసంహరించుకోగల సమర్థుడు ఇతరులు నామమాత్రమే గానీ మరెవరికీ ఆ శక్తి లేదు కనుక ఆయన్ని ప్రార్థించండి ' అని ఆదేశించింది తానూ ఆ సర్వేశ్వరుడి అనుగ్రహన్ని కోరుతూ మనస్సులో సంకల్పించింది

బ్రహ్మ, విష్ణువులు విశ్వేశ్వరుడిని ప్రార్థించారు వారి ప్రార్థనా ఫలితంగా పరమేశ్వరుడు సాకారరూపంగా వారిముందు ప్రత్యక్షమయ్యాడు ఆ ఆదిపురుషుని దర్శనభాగ్యం పొందిన వారిద్దరూ ఆయన్ని అనేక విధాల స్తుతించారు వారి స్తోత్రములకు, భక్తి ప్రపత్తులకు సంతసించిన జగదీశ్వరుడు ఇలా చెప్పాడు

'బ్రహ్మ విష్ణులారా సృష్టి స్థితి లయములు నా సంకల్పముచేతనే సంభవించును ఈ కార్యనిర్వహణ నిమిత్తము నా సంకల్ప ప్రభావము చేతనే మీరు జనించారు ఆదిశక్తి నా అర్ధభాగము మీరూ నా స్వస్వరూపులేగానీ నా అర్ధశరీరమైన పరాశక్తినుండి ఒక అంశ



లక్ష్మిగా అవతరించి విష్ణు వక్షస్థలమున నివసించును స్థితికారకుడైన విష్ణువుకి యీ లక్ష్మి సహకరిస్తూ సకల ఐశ్వర్య ప్రదాత అవుతుంది ఈ ఐశ్వర్య సంపదలుచేత మోహమూ, క్రోధమూ,కామము, ద్వేషములకు కారణమైన రజోగుణము నేటినుండి సృష్టిజీవులను ఆశ్రయిస్తుంది అట్లే పరాశక్తినుండి మరొకఅంశ అవతరించి సరస్వతిగా బ్రహ్మావాక్కున నివశించి అవిద్యా, విద్యా గుణములకు కారకురాలవుతుంది ఈ విధంగా సత్త్వగుణము జీవులను ఆశ్రయించి వారిని జడత్వము, మందమతి గల అజ్ఞానులుగను, విద్యాజ్ఞానము కలిగిన విజ్ఞానవంతులుగను వేరు చేస్తుంది అజ్ఞానులు ఐశ్వర్య, కామ, క్రోధ బలవంతులై జ్ఞానులని బాధించి మృత్యువును ఆశ్రయిస్తారు అట్టి మృత్యుజీవులను హరించుటకు నా అంశ రుద్రునిగా బ్రహ్మముఖమునుండి అవతరిస్తుంది రుద్రుడనైన నేను సహజముగా సత్త్వగుణ ప్రధానముగల వాడినైనందున జీవసంహారకారణమునకు పరాశక్తినుండి మరొక అంశ అవతరించి కాళిక అనుపేరిట నా రుద్రరూప అర్ధభాగమున నివసిస్తుంది ఈ సంహారక శక్తి స్వరూపిణిని ఎవ్వరూ జయించలేరుగాన, యీ కాళికాశక్తి ఇతరులకి దుర్భేద్యమైనదిగాన ఈమె 'దుర్గ' అను పేరిటకూడా పిలువబడుతుంది ఇప్పటినుండి సత్త్వరజస్తమో గుణములు సర్వసృష్టినీ ఆశ్రయిస్తున్నందున పంచభూతములతో సహా జీవులన్నింటికీ పుట్టుక, వృద్ధి, క్షయములు ఏర్పడతాయి వీటిచేతనే కాలము పగలు రాత్రిగానూ, యుగములు, సంవత్సరములు, మాసములు, రోజులుగానూ ఏర్పడుతుంది యుగములు కృత,త్రేతా, ద్వాపర, కలియుగములుగా విభజించబడి యీ నాలుగూ ముగిసిన పిమ్మట నా సంకల్పముచేత జగత్ప్రళయము సంభవిస్తుంది అప్పుడు సృష్టికి మూలకారకుడైన నాయందు యీ యావత్తు సృష్టీ లయమవుతుంది అంతవరకూ మీరు మీ విధులను నిర్వర్తిస్తూ, జగన్మాత సహాయ సహకారములను అర్థిస్తూ , మీ కర్తవ్యమును నిర్వహించి, ప్రళయకాలమున యోగనిద్రలో లీనమవుతారు మరల నేను పునఃసృష్టిని సంకల్పించినప్పుడు మీరు యోగనిద్ర చాలించి నా ఆదేశానుసారం తిరిగి మీ కర్తవ్యములను ఆరంభిస్తారు ' అని తెలిపాడు

అలా ఈశ్వరుడు పలికిన మరుక్షణం ఆతని శరీరమునుండి ఒక అంశ ప్రభవించింది ఆ ఈశ్వరాంశ మహాతేజస్సుతో ప్రకాశిస్తూ వచ్చి బ్రహ్మదేవుని కర్ణేంద్రియముద్వారా ప్రణవనాదము ఉచ్చరిస్తూ అతడి శిరోభాగంలోకి జొరబడింది ఆ ప్రణవనాదాన్ని బ్రహ్మ తన చెవిద్వారా వింటూ నోటితో ఉచ్చరిస్తూ బయటికి వదిలాడు అదే వేదము అయింది ఆ వేదమే అనంతరం బ్రహ్మ తన చతుర్ముఖాలద్వారా అవధరించడంచేత వేదము నాలుగు భాగములుగా నాలుగు నోళ్లద్వారా వెలువడి చతుర్వేదాలు అయ్యాయి

ఇలా బ్రహ్మశిరస్సులోకి ప్రవేశించిన ఈశ్వరతేజస్సు వేద విజ్ఞానాన్ని పొందిన బ్రహ్మముఖ మండలం మీద బ్రహ్మజ్ఞానముగా ప్రకాశించి, ఆ బ్రహ్మజ్ఞాన ప్రకాశమే రుద్ర గా సాకారరూపాన్ని దాల్చింది ఈ రుద్రుడినే బ్రహ్మశిరోభాగాన్నించి ఉద్భవించిన 'శివుడు (శిరస్సునుండి ఉద్భవించినవాడు) అంటారు ఈ రుద్రుడు నిలువెల్లా భస్మము ధరించినవాడై సాత్త్విక గుణ ప్రతీకగా, పరమ శాంతపురుషుడైన యోగీశ్వరునిగా భాసించాడు






అనంతరం పరమేశ్వరుడి సాకారం ఒక్కసారిగా జగన్మాతగా సాక్షాత్కరించింది బ్రహ్మ విష్ణు, రుద్రులు ఆమెను సంభ్రమాశ్చర్యాలతో తిలకిస్తుండగా ఆమెనుండి ఒక అంశ జన్మించి ఐశ్వర్య ప్రదాయిని, పద్మ నివాసిని అయిన శ్రీలక్ష్మిగా అవతరించి పద్మాసనంతో సహా విష్ణు హృదయస్థానాన్ని చేరింది ఆ పద్మాసిని చేరికతో విష్ణువు అత్యధిక తేజోవంతుడయ్యాడు

అనంతరం జగన్మాత శరీరంనించి మరొకఅంశ జన్మించి ధవళవస్త్రధారిణీ, వీణాపుస్తక వాహిని అయిన సరస్వతిగా అవతరించి బ్రహ్మవాక్‌స్థానాన్ని అలంకరించింది బ్రహ్మవాక్కును అలంకరించడంచేత ఆమె వాణిగా కీర్తించబడింది వాక్‌స్థానమందు వాణిచేరికతో బ్రహ్మ అద్భుత జ్ఞానంతో ప్రకాశించాడు

అంతట జగన్మాతనుండి మూడవఅంశ అవతరించి ఖడ్గ, శూల, గదా, కాలపాశాలతో కాళికగా అవతరించి ప్రచండ ప్రళయాగ్ని కీలకరౌద్ర భీకరతేజస్సుతో మెరిసిపోతూ వచ్చి రుద్రుని శరీరంలో ఎడమవైపు సగభాగాన్ని అలంకరించింది ఆ స్త్రీ పురుష ఆకారుడైన రుద్రుడే అర్ధనారీశ్వరుడుగా కీర్తించబడ్డాడు అప్పుడా త్రిమూర్తిస్వరూపాలనూ చూస్తూ జగన్మాత ఇలా పలికింది

'ఈ సకల చరాచర సృష్టికి మూలమైన పురుషుడూ నేనే ప్రకృతీ నేనే జగదీశ్వరుడూ నేనే జగన్మాతనూ నేనే నా సంకల్పంచేత నా మనోరథాన్ననుసరించి సృష్టి, స్థితి లయ కార్యాలను నిర్వర్తించడానికి నా పురుషాంశాలుగా, నా ప్రతిరూపాలైన బ్రహ్మ, విష్ణు, రుద్రులుగా మీరు అవతరించారు మీ కార్యాలను నిర్వర్తించడానికి అవసరమైన శక్తి సామర్థ్యాలను కల్పించడానికి నాశక్తి స్వరూపాన్నించి లక్ష్మీ, సరస్వతీ, దుర్గలుగా అవతరించి నా ప్రతిరూపాలైన మీ రూపాలయందు నివశిస్తున్నాను సరస్వతీ జ్ఞానా జ్ఞానాలను సృష్టిస్తున్నాను లక్ష్మిగా అజ్ఞాన కారకమైన ఐశ్వర్య సంపద, కామ, వ్యామోహ, ద్వేష క్రోధాలనూ జ్ఞానంచేత వివేక విజ్ఞాన, భక్తి, ముక్తి, వైరాగ్యాలను వృద్ధిచేస్తాను అజ్ఞాని అయినా, సుజ్ఞాని అయినా మృత్యువును ఆశ్రయించక తప్పదు కనుక రుద్రాంశ స్వరూప దుర్గనై సర్వసంహార కార్యాన్ని నేనే నిర్వర్తిస్తాను ఈ సృష్టి స్థితి లయములకు మీరు నిమిత్తమాత్రులని గుర్తించండి పరమేశ్వరుడైన ఆది పురుషుడు నిర్వికారుడూ సాత్త్విక తపోసంపన్నుడైనందున అతడి సంకల్పానుసారం అతడి అర్ధభాగంగా అవతరించి జగన్మాతనైన నేనే నేనే త్రిగుణరూపిణిగా త్రిశక్తిస్వరూపిణిగా అవతరించి మీమీ అవతారములందు త్రిమాతలుగా నివశించి యీ సకల చరాచర సృష్టికే సృష్టి స్థితి లయములు కల్పించుదానీనని గుర్తించండి '

జగన్మాత అలా ప్రకటించగానే బ్రహ్మ, విష్ణు, రుద్రులు ఆ ఆదిశక్తికి జేజేలు పలుకుతూ ఆమె మహత్మ్యాన్ని అనేక విధాల కీర్తించారు అప్పుడు జగన్మాత త్రిమూర్తులనూ ఆశీర్వదించి అంతర్ధానమైంది

ఆనాటినుండి సృష్టికి కాలమూ, యుగములూ ఏర్పడ్డాయి సూర్యచంద్ర నక్షత్రాలకు గతులు నిర్దేశించబడ్డాయి ఈ సూర్యచంద్రులకి ఏర్పడ్డ గతులచేతనే పగలూ, రాత్రి, త్రికాలములూ, ఆరుఋతువులూ ఏర్పడ్డాయి జీవులని 'సత్త్వ రజో స్తమో' గుణములుచేరడం చేత, ఆ గుణ ప్రభావాలు ఆధిక్యతను బట్టి జీవులు, అందులో బుద్ధిజీవులు మానవ,దానవ, దేవతలుగా ఏర్పడ్డారు





బుద్ధిజ్ఞానమూలేని జీవులు తమలోవున్న గుణాల ఆధిక్యతల ననుసరించి, సింహము, పులి, ఏనుగు, అశ్వము, సర్పము, గోవు, మహిషము, జింక, లేడి, నెమలి, మూషికము, శునకము ఇలా జన్మించి వాటి పూర్వజన్మ పుణ్యసంస్కారముచేత వీటిలో కొన్ని జంతువులు వివిధ దేవతలకి వాహనాలుగా పవిత్రస్థానాలను అలంకరించాయి

బ్రహ్మవాక్కునందు వాణి రూపమున ఆదిశక్తి వశించడంచేత ఆమె ఆజ్ఞానుసారం సృష్టిక్రమం ఆరంభమై కొందరు జడత్వబుద్ధితో అసురలయ్యారు అట్టివారినికూడా పోషించి పెంచడమే ధర్మంగా విష్ణు వక్షస్థలమందు నివశిస్తున్న లక్ష్మి వారిని ఐశ్వర్య, అధికార, కామ వ్యామోహితులను చెయ్యసాగింది అలా ఐశ్వర్య, అధికార కామ వ్యామోహితులైన అసురులు బలగర్వ దర్పంతో మిడిసిపడుతూ దేవతలనూ,సజ్జనులనూ హింసిస్తూ చెలరేగుతుంటే వారిని సంహరించడానికి రుద్రుని అర్ధభాగాన్ని ఆశ్రయించి తన సంహారకర్తవ్యాన్ని నిర్వర్తించడానికి దుర్గ వివిధ అవతారాలను ధరించి అసురసంహారం చేసింది

అయితే జగన్మాత 'త్రిశక్తి'స్వరూపిణి కనుక ఆ త్రిశక్తి స్త్రీ అవతారాలలో రాక్షససంహారం చేసిన సంఘటన కారణంచేతనే ఆవిడ 'ముగురమ్మల మూలపుటమ్మ'గా కీర్తించబడింది ఈ మూడు అవతార విశేషాలలో ముందుగా 'దుర్గ' అవతారం యొక్క ప్రాశస్త్యాన్ని తెలుసుకుందాం

## దుర్గావతారం-దుర్గమాసుర సంహారం

కృతయుగములో పాతాళలోకములో 'రురువు' అనే అసురుడు ఒకడు పాతాళరాజ్యమును పాలించేవాడు వాడు మహాబలశక్తి సంపన్నుడైనప్పటికీ మృత్యుభయంచేత తన రాక్షస రాజ్యమును వదిలి వచ్చేవాడు కాదు

వాడికి చాలాకాలం వరకూ సంతానం కలగలేదు తన అనంతరం తన రాజ్యం వారసులు లేనందువల్ల సాటి రాక్షసరాజుల పాలవుతుందేమో, లేక తమ అసురులకి ఆజన్మ విరోధులైన దేవతలు తన రాజ్యాన్ని ఆక్రమిస్తారేమోనని నిత్యం దిగులుపడుతుండేవాడు

అలాంటి సమయంలో ఒకసారి త్రిలోకసంచారి నారదుడు ఆ రాక్షసరాజ్యానికి వచ్చాడు దేవర్షి నారదుడు అందరికీ పూజ్యనీయుడే కాబట్టి రురువు అర్ఘ్యపాద్యాదులిచ్చి నారదుడిని సంతోషపర్చి తన మనస్సులోవున్న విచారాన్ని బయటపెట్టుకున్నాడు

'దేవర్షీ తమరు త్రికాలజ్ఞులు తమకి తెలియని విషయంలేదు అందుకే మనస్సుండబట్టలేక అడుగుతున్నాను నాకు ఎప్పటికైనా పుత్రసంతాన భాగ్యం వుందా? నా వంశానికీ రాజ్యానికీ వారసుడు ఉదయిస్తాడా? తమరు నా యందు దయదల్చి తమ దివ్యదృష్టిచేత పరిశీలించి సత్యాన్ని చెప్పండి ' అని వేడుకున్నాడు

సరే రురుడు రాక్షసుడైనా తనకి అతిధిపూజచేసి ఆతిధ్యమిచ్చి సత్కరించి ప్రార్థించాడు గదానన్న భావంచేత నారదుడు అసురుడి వంశ చక్రక్రమాన్ని దివ్యదృష్టిచేత వీక్షించాడు నారదుడు అలా తన దివ్యదృష్టితో పరిశీలించగానే అశురవంశచక్రం అతడి మనోనేత్రం ముందు ప్రత్యక్షమై ఒక్కసారిగా మహర్షి శరీరం గగుర్పొడిచింది






రురుడికి సంతానం వుందిగానీ ఆ సంతానంవల్ల లోకాలన్నీ పీడించబడి అస్తవ్యస్తమై పోతాయి సంతానం వుందని చెబితే అసురుడు సంతోషిస్తాడుగానీ అతడు సత్యము చెప్పమని ముందే ప్రార్థించాడు

తాను ఆ ప్రార్థనకి కట్టుబడి 'నీకు కొడుకు పుడతాడయ్యా, కానీ వాడు లోకకంటుకుడ వుతాడని' సత్యంచెబితే ఆ వార్త ఇతర లోకాలకి చేరకుండానే అసురుడు ముందుగా తనని బంధిస్తాడు ఆపైన కొడుకుని కని తనే వాడిని లోకకంటకుడిగా తయారుచేసి వాడిచేత లోకాలన్నీ జయింపజేస్తాడు

అలా అని తాను సత్యవాది కావున అసత్యం చెప్పలేడు మరెలా? ఇలాంటి ధర్మసంకటంలో పడ్డ నారదుడు అసురుని హెచ్చరికతో తేరుకుని 'అయ్యో, సంతానానికేం భాగ్యం? సృష్టికర్త బ్రహ్మదేవుడు కదా! నీకు నిజంగా సంతానాపేక్షవుంటే ఆయన్ని మెప్పించి ప్రసన్నుణ్ణి చేసుకో ఆయనే ప్రసాదిస్తాడు సంతతినీ, సద్గతినీ 'అని చెప్పాడు సద్గతి' అన్న మాటని వత్తి పలుకుతూ

'రురువు' ఆ మాటలోని ఆంతర్యాన్ని గ్రహించలేక అప్పటికప్పుడే ప్రయాణమై బ్రహ్మగురించి తపస్సు చెయ్యడానికి అరణ్యాలకి వెళ్లాడు

రురువు నిష్టాగరిష్టుడై బ్రహ్మను గూర్చి ఘోరతపస్సు చేశాడు అతడి తపోదీక్షకు మెచ్చి బ్రహ్మ అతడిని అనుగ్రహించడానికి బయల్దేరగా నారదుడు అడ్డుపడి తన దివ్యదృష్టిచేత తాను గ్రహించిన విషయాన్ని ఆయన చెవిన వేసి 'తండ్రీ రురుడికి వరాలు ప్రసాదించేముందు సంయమనం పాటించు అని ప్రార్థించాడు

బ్రహ్మదేవుడు మందహాసంచేసి 'నువ్వే కాదు ఈ సృష్టిలోని వారందరూ నాకు పుత్రసమానులే పుత్రుడి కోర్కెను మన్నించడం పితృదేవుడిగా నాధర్మం'అని చెప్పి సృష్టికర్తనన్న కించిత్ గర్వంతో రురుని ముందు ప్రత్యక్షమయ్యాడు

రురుడు అనేకవిధాలుగా బ్రహ్మదేవుడిని కీర్తించాడు రురుని పొగడ్తలకు పొంగిపోయిన బ్రహ్మ 'నీతపస్సుకీ, భక్తికీ సంతసించాను వరంకోరుకో ' మన్నాడు

రురువు చేతులుజోడించి 'బ్రహ్మదేవా! నీవే సకల చరాచర సృష్టికీ కర్తవు అట్టి నిన్నుకూడా మించిన శక్తి, ప్రతాపవంతుడైన కొడుకునొకడిని నాకు వరంగా అనుగ్రహించు ' అని అర్థించాడు

బ్రహ్మదేవునికి ఆ వరం ఇవ్వడానికి గొంతు పెగల్లేదు అలాంటి వరం యిస్తే ఆ అసురుడికి పుట్టేవాడు తనను మించినవాడై తనలోకాన్ని ఆక్రమించేస్తాడు సృష్టిక్రమాన్ని తారుమారు చేసేస్తాడు

తానేమో వరం కోరుకోమని అనేశాడు అసురుడు వరం కోరేశాడు

ఇప్పుడా వరం యివ్వకుండా మాటతప్పితే తనకి బ్రహ్మాధిపత్యం దూరమై అసత్యపాపానికి గాను తాను సృష్టించిన యమలోకంలోనే రౌరవాది మహానరకాలు అనుభవించాల్సి వస్తుంది అందుచేత పరమేశ్వరుని ఆగ్రహానికీ, పరాశక్తి శాపానికీ గురికావల్సి వస్తుంది మరేలా?

బ్రహ్మదేవుడు ఇలా ఆలోచించి మనస్సులోనే జగన్మాతని స్మరించుకుని 'అమ్మా,జగన్మాతా నిన్ను మరిచి నేనే సృష్టికర్తనని అహంకరించి మాటజారాను ఆ వాక్కూ నీదే ఆ వరదానమూ నీదే నన్ను కరుణించి అనుగ్రహించు ' అని ప్రార్థించాడు

బ్రహ్మవాక్కున వాణిరూపంగా వెలసిన జగన్మాత మందహాసంచేసి ఆతడి వాక్కునుండి తాను పలుకుతూ 'తథాస్తు బ్రహ్మజ్ఞానాన్ని హరించగల కుమారుడు నీకు కలుగుతాడు కానీ బ్రహ్మని మించిన శక్తిపరుడు కావాలని నువ్వు వాంచించడంచేత వాడు భూమ్మీద పడిన మరుక్షణమే నీ శిరస్సు వేయివ్రక్కలై నువ్వు సద్గతి పొందుతావు ' అని వరం యిచ్చింది ఆ మరుక్షణమే బ్రహ్మ అంతర్ధానమైపోయాడు

బ్రహ్మవరప్రసాదితుడైన రురువు వరగర్వంతో తన రాజ్యానికి తిరిగివచ్చాడు బ్రహ్మ తనకి ప్రసాదించిన వరాన్ని గురించి రాక్షసగురువు శుక్రాచార్యునికి తెలియపరిచాడు

శుక్రాచార్యుడు ఆ బ్రహ్మవరంలోని అంతరార్థాన్ని విడమర్చి వివరిస్తూ 'ఓరి రాక్షసా ఎంత తెలివితక్కువ వరం కోరావురా! రాక్షసకులంలో బ్రహ్మ ఎలా అవతరిస్తాడు? మనం అసురులం అసురులు దేవతలను జయించగలరేమోగానీ దేవతలు కాగలరా? పూర్వజన్మ సంస్కారంచేతగానీ ఎవరూ దేవతలుగా పుట్టరు అలా పూర్వజన్మ సంస్కారం చేత అసురవంశంలో పుట్టిన ప్రహ్లాదుడి కారణంగానే అతడి తండ్రి హిరణ్యకశిపుడు మృత్యువాత పడ్డాడు నువ్వూ అలాంటి వరాన్నే కోరుకున్నావు గదా ' అని వాపోయాడు

అప్పుడు రురుడికి ఒకప్పుడు నారదుడూ, ఇప్పుడు బ్రహ్మ పలికిన 'సద్గతి' అన్న మాటలోని ఆంతర్యం అర్థమైంది రురువు జరిగిన దానికి తన బుద్ధిమాంద్యానికి చాలాబాధపడి, చేసేదేమీ లేక 'గురుదేవా నాడు హిరణ్యకశిపుడు చావుకీ, రేపు రాబోయే నా మృత్యువుకీ కారణం ఆ బ్రహ్మవాక్కు ఆ బ్రహ్మవాక్కుని భగ్నం చేసేలా నాకు పుట్టబోయే కుమారుడిని తీర్చిదిద్దండి ' అని ప్రార్థించాడు శుక్రాచార్యుడు దానికి సమ్మతించాడు

క్రమంగా కాలం గడిచి బ్రహ్మవరం ప్రకారం రురువు భార్యకి ఒక కుమారుడు కలిగాడు ఆ పసిబిడ్డ మాతృగర్భం వదిలి భూమ్మీద పడిన మరుక్షణమే రురువు తల పగిలి వెయ్యివ్రక్కలైంది వాడి ప్రాణం పోయింది అయితే బ్రహ్మగురించి తపస్సు చేశాడు కనుక వాడు సద్గతిపొంది సత్యలోకం చేరుకున్నాడు తాను జరిగిన జన్మలో అసురుడినన్న జ్ఞానం నశించి సత్యలోక సుఖాలను రురువు అనుభవించసాగాడు

ఇక్కడ రురువుకి పుట్టిన కుమారుడికి దుర్గమాసురుడు అని నామకరణం చేశాడు శుక్రాచార్యుడు ఆతడికి అనేక విద్యలు నేర్పుతూనే 'నీతండ్రి చావుకి కారకుడు బ్రహ్మ అతడిమీద పగతీర్చుకో 'అంటూ చిన్నప్పటినించీ ద్వేషాన్ని నూరిపోశాడు శుక్రాచార్యుడు

అందుచేత దుర్గమాసురుడి మనస్సంతా బ్రహ్మపట్ల ద్వేషంతో నిండిపోయింది అతడు యుక్తవయస్కుడై రాక్షసరాజ్యాధికారాన్ని చేపడుతూనే బ్రహ్మమీద పగకొద్దీ బ్రహ్మజ్ఞానులైన మునులను, మహర్షులను హింసిస్తూ యజ్ఞయాగాదులను ధ్వంసం చేశాడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలనూ, అమరులనూ పూజించే జనాలను బాధించి చిత్రహింసలు పెట్టేడు ఆఖరికి పాతాళలోకవాసులైన యక్ష, గంధర్వ, సిద్ధ, నాగ, కిన్నెర, కింపురుషాది జాతులను కూడా వాడు సుఖంగా వుండనియ్యలేదు

దుర్గామాసురుడి బాధలు పడలేక దేవతలూ, మునులూ సత్యలోకానికి వెళ్లి బ్రహ్మదేవుని అనేక విధాల స్తుతించి తమ బాధలు మొరపెట్టుకున్నారు



'దుర్గమాసురుడు నా అంతటి శక్తిసంపన్నుడు వాడిని నేను కూడా సంహరించలేను వాడిని మాయ ఆవహించి వాడి పాపం పూర్తిగా పండినప్పుడే కానీ వాడికి మరణం సంభవించదు.' అన్నాడు బ్రహ్మ

'అయితే వాడికి త్వరగా మాయకమ్మి వాడిపాపం పండే ఉపాయాన్నయినా ఉపదేశించండి అని వేడుకున్నారు దేవతలు

'ఇలాంటి మాయోపాయాలు ప్రయోగించి అసురులను మృత్యుపథంవైపు నడిపించగలవాడు నారదుడొక్కడే ' అనిచెప్పి బ్రహ్మ, నారదుడివైపు చూసి 'కుమారా నాడు నన్ను మాయ కమ్మడంచేత నీ మాటకూడా వినకుండా రురువుకి నేనిచ్చిన వరఫలితమే ఇందర్నీ బాధిస్తోంది అయితే మనం కారణ నిమిత్త మాత్రులమే సర్వమూ జగన్మాత సంకల్పము అయినా మన ప్రయత్నం మనం చెయ్యాలి అప్పుడు కానీ ఆ ఆదిశక్తి అసురసంహారం చెయ్యదు కనుక నీవూ నిమిత్త మాత్రుడివై సర్వమూ ఆ తల్లిపై భారముంచి అసురుడికి మాయోపాయాన్ని బోధించు అని చెప్పాడు

నారదుడు అందుకు సమ్మతించి జగన్మాతని మనస్సులోనే స్మరించుకుని హరినామ సంకీర్తనచేస్తూ దురమాసురుడి రాజ్యానికి ప్రయాణమయ్యాడు

దుర్గమాసురుడు తమ రాక్షసగురువు శుక్రాచార్యునితో సమాలోచనలుచేస్తున్న తరుణంలో నారదుడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు

శుక్రాచార్యుడు అతన్ని చేస్తూనే కలవరపడుతూ కుమారా దుర్గమాసురా ఈ నారదుడు మన విరోధి బ్రహ్మమానసపుత్రుడు పైగా అసురులని సంహరించడమే లక్ష్యంగా పెట్టుకున్న శ్రీహరి భక్తుడు ఇతడి ప్రోద్బలంచేతనే ని తండ్రి బ్రహ్మగురించి తపస్సుచేసి నిన్ను వరంగా పొంది తన ప్రాణాలకే చేటు తెచ్చుకున్నాడు ఇతడి మాటలు నమ్మకు అని హెచ్చరించాడు

ఆపవయ్యా శుక్రాచార్యా అంతటిలో ఆపు మునుపు హిరణ్యకశిపుడు తపస్సుకి వెళ్లినప్పుడు అతడి భార్యని చెరపట్టి ఆమె గర్భమందున్న పిండాన్ని ఇంద్రుడు నాశనం చెయ్యబోతే అడ్డుపడి కాపాడించి నేనా? నువ్వా? ఈతని తండ్రి రురువు సంతానంలేక బాధపడుతుంటే బ్రహ్మ గురించి తపస్సుచేసి బ్రహ్మనే సంతానంగా పొందమని సలహాయిచ్చింది నేనా? నువ్వా?' అన్నాడు నారదుడు

శుక్రాచార్యుడు ఆ మాటల్లోని ఆంతర్యాన్ని గుర్తించలేక నువ్వే అన్నాడు

'కదా మరి నేను కాపాడబట్టేకదా ప్రహ్లాదుడు తల్లి గర్భంలోంచి బ్రతికి బట్టకట్టి తండ్రి అనంతరం రాజయ్యాడు! ఆతడి తండ్రి హిరణ్యకశిపుడు కోరి శ్రీహరితోవైరం తెచ్చుకుని ఆతడి చేతుల్లో మరణించాడంటే అది అతడి స్వయంకృతం కానీ అతడి చావుకి కారకుడిని నేనా? అన్నాడు నారదుడు

అవునవును అదీ నిజమే'నన్నాడు దుర్గమాసురుడు

అదేకాదు కుమారా! ఏ విషయంలోనూ మీ తండ్రికి తపస్సుచేసి బ్రహ్మనే పుత్రుడిగా పుట్టమని వరం కోరవయ్యా పుట్టేవాడు సృష్టికర్త అయి ముల్లోకాలనూ శాసిస్తాడని సలహా యిచ్చాను మీ నాన్న బ్రహ్మ ప్రత్యక్షంకాగానే గర్వంతో పొంగిపోయి బ్రహ్మని కొడుకుగా పుట్టమని కోరుకోవడం మర్చిపోతే ఇంకోదో కోరుకుని తన చావు తానే తెచ్చి పెట్టుకుంటే ఆ తప్పునాదా? సాగదీశాడు నారదుడు

ఇదీ నిజమే ' నన్నాడు దుర్గమాసురుడు ఆలోచనలో పడుతూ

శుక్రాచార్యుడు కల్పించుకుంటూ 'కానీ కుమారా, యీ నారదుడు ఆ బ్రహ్మ మానసపుత్రుడు మర్చిపోకు అని హెచ్చరించాడు ఉక్రోషంగా

'అయితే ఏమిటి? అసలా మాటకొస్తే నువ్వు మాత్రం ఆ బ్రహ్మపుత్రుడివి కావా? అందరికీ సృష్టికర్త అతడేగదా! కానీ ఆ బ్రహ్మ ఏంచేశాడు? బృహస్పతిని దేవగురువు చెయ్యాలన్న దుర్బుద్ధికొద్దీ నీ నొసటిమ్రాత కాస్తంత తక్కువచేసి రాశాడు అందుచేతనే గదా, నువ్వు అసురకుల గురుత్వంతో సరిపెట్టుకోవాల్సి వచ్చింది? లేకపోతే అత్యున్నత పదవి అయిన దేవగురుపీఠం నీకు దక్కేది అలా దక్కనందువల్లే గదా, నువ్వు బ్రహ్మపట్ల ద్వేషం పెంచుకున్నావు?' అని దెప్పి పొడిచాడు నారదుడు శుక్రాచార్యుడు ఖంగారుపడ్డాడు

'అలా కలవరపడకయ్యా, మహానుభావా! సత్యం ఎప్పుడూ నిష్ఠూరంగానే వుంటుంది సరే, నీ సంగతలా వుంచు నేను స్వయాన ఆ బ్రహ్మ సొంతకొడుకుని కదా! బుద్ధిలో, జ్ఞానంలో తపశ్శక్తిలో ఆ బృహస్పతితో సరిసమానుడిని కదా! ఆ గురుత్వాన్ని నాకన్న కట్టబెట్టాడా? ఉహూఁ అందుచేతనే గదా అతడు నా కన్నతండ్రి అయినా అతడి నామాన్ని స్మరించకుండా అతడి కడుపు ఉక్రోషంతో రగిలిపోయేలా నిరంతరం హరినామ స్మరణం చేస్తున్నాను అన్నాడు నారదుడు

'కానీ, ఆ హరి అసురవైరి కదా?' రెట్టించాడు శుక్రాచార్యుడు

'కాబట్టే హరినామ స్మరణంచేస్తూ అతడ్ని నమ్మించి ఇలా మీలాంటి వాళ్ళందర్నీ కల్సుకోగలుగుతున్నాను మీకు సమయోచిత ఉపాయాలు చెప్పగలుగుతున్నాను లేకుంటే ఆ శ్రీహరి తన ప్రభావాన్ని అందరికంటే ముందే నాపై చూపించేవాడు అప్పుడు మీకు ఉపాయాలు చెప్పడానికి నాథుడు కరువయ్యేవాడు ' అన్నాడు నారదుడు ఆతడి మాటలు వారిమీద ప్రభావం చూపించాయి

ఆ బ్రహ్మమీద నీకూ యింత ద్వేషంవుందని మాకు ఇప్పుడే అర్థమైంది నారదా మరి ఆ బ్రహ్మని సాధించే ఉపాయం ?' అడిగాడు దుర్గమాసురుడు

బ్రహ్మని ప్రసన్నం చేసుకోవ...మే ' చప్పున జవాబిచ్చాడు నారదుడు

శుక్రాచార్యుడు ఉలిక్కిపడి అంటే ? అడిగాడు అనుమానంగా

బ్రహ్మకి ఇంతటి శక్తి కలగడానికి కారణం ఏమిటి?' ఎదురు ప్రశ్నించాడు నారదుడు

'బ్రహ్మజ్ఞానం జవాబిచ్చాడు శుక్రాచార్యుడు

'ఆ బ్రహ్మజ్ఞానం దేని వలన లభిస్తుంది?' మళ్లీ ప్రశ్నించాడు నారదుడు

చతుర్వేదాలు చప్పున చెప్పాడు శుక్రాచార్యుడు

ఆ చతుర్వేదాలని బ్రహ్మదగ్గర్నించి లాగేసుకుంటే అతడు అజ్ఞాని అయిపోతాడు అన్నాడు నారదుడు

దుర్గమాసురుడు దిగ్గునలేచి 'ఇప్పుడే వెళ్లి బ్రహ్మదగ్గర్నించి వేదాలు లాక్కొస్తాను అన్నాడు ఆవేశంగా

'కూర్చోవయ్యా, కూర్చో ఇలాంటి తొందరపాటు వల్లే మీ అసురులంతా టపాటపా పిట్టల్లా నేలరాలిపోతున్నారు ' అన్నాడు నారదుడు అతడ్ని శాంతింపజేస్తూ

శుక్రాచార్యుడు తలపంకిస్తూ 'నిజమే ఆ వేదాలు బ్రహ్మ సొంతంకావు వాటికి ఆకార రూపమూ లేదు రూపం లేనివాటిని అపహరించడం అసాధ్యం ' అన్నాడు దుర్గమాసురుడు నిరుత్సాహంతో చతికిలపడ్డాడు

'ఇంతవరకూ వాటికి రూపంలేని మాట నిజమే కానీ, ఇప్పుడు కల్పించమని కోరి, అప్పుడు వాటిని అపహరిస్తే సరి ' అన్నాడు నారదుడు సాలోచనగా

'అయితే ఉపాయం?' అడిగాడు దుర్గమాసురుడు

'నీ తండ్రి అనుసరించిన మార్గమే' చెప్పాడు నారదుడు

శుక్రాచార్యుడు మళ్లీ అనుమానంగా చూశాడు నారదుడు అతడ్ని పట్టించుకోకుండా 'నువ్వు కూడా మీ తండ్రిలాగే బ్రహ్మకోసం తపస్సుచెయ్యి బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకోమంటాడు చతుర్వేదాలకి ఆకృతి కల్పించమని వరం కోరుకో ఇచ్చిన మాటకోసం అతడు వేదాలకి లిపిరూపం కల్పిస్తాడు అప్పుడా తాళపత్రాలను ' అంటూ నవ్వాడు

'లాక్కొస్తాను ' అన్నాడు దుర్గమాసురుడు గర్వంగా

'కానీ, కుమారా, అది అనుకున్నంతా సులభం కాదు ' అంటూ అభ్యంతరం చెప్పబోయాడు శుక్రాచార్యుడు దుర్గమాసురుడు అతడ్ని పట్టించుకోకుండా తక్షణం తపస్సుకి బయల్దేరాడు

దుర్గమాసురుడు అరణ్యానికి వెళ్లి బ్రహ్మకోసం తపస్సు ఆరంభించాడు అతికొద్ది కాలంలోనే బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు వేదాలకి ఆకృతి కల్పించమని వరం కోరుకున్నాడు దుర్గమాసురుడు

బ్రహ్మకి అంతా తెలిసినా ఏమీ తెలియనట్లే నటిస్తూ 'వేదాలంటే ఎవరనుకుంటున్నావు? సాక్షాత్తూ ఆ జగన్మాత సంకల్ప శక్తిస్వరూపం ఆ శక్తిని బోధనద్వారా స్వీకరించి జ్ఞానాన్ని పొందవచ్చునేగానీ, ఆ శక్తికి ఆకృతి కల్పించడమంటే పరాశక్తిని నెత్తిన పెట్టుకోవడమే ఆ శక్తిని పరమేశ్వరుడు తప్ప మరెవ్వరూ భరించలేరు పరులు భరించాలని ప్రయత్నిస్తే ఆ శక్తి వారికే భారమై వాళ్ల ప్రాణాలను హరిస్తుంది జాగ్రత్త ' అని హెచ్చరించాడు

'ఆ బరువు బాధ్యతలు నావి నీ మాటే యదార్ధమైతే, ఆ పరాశక్తిచేత తప్ప మరెవరిచేతా నాకు మరణంలేకుండా వరాన్ని అనుగ్రహించి, వేదాలకి ఆకృతి కల్పించు ' అన్నాడు దుర్గమాసురుడు

'తథాస్తు' అన్నాడు బ్రహ్మ మరుక్షణం అతడి చతుర్ముఖాలనుండి వేదాలు గంగా ప్రవాహంలా ధారాపాతంగా ప్రణవనాదాలతో బహిర్గతమై తాళపత్రాలుగా ఆకృతిదాల్చి బ్రహ్మ హస్తాన్ని అలంకరించాయి

'ఇక నన్ను ఆ పరాశక్తి తప్ప మరెవ్వరూ జయించలేరు బ్రహ్మ ఈ వేదాలను నేను అపహరిస్తున్నాను బలవంతుడివైతే నన్నెదిరించి వేదాలను కాపాడుకో ' అంటూ దుర్గమాసురుడు బ్రహ్మ చేతిలోవున్న వేదరూప తాళపత్రాలను చేజిక్కించుకుని అట్టహాసంచేస్తూ వెనుతిరిగాడు వేదజ్ఞానం దూరమవడంతో బ్రహ్మ నిస్తేజుడై తన లోకానికి చేరుకున్నాడు

ఆనాటినించీ బ్రహ్మ తన ముఖాలద్వారా మహర్షులకి వేదధర్మాలు బోధించలేకపోయాడు అందుచేత యజ్ఞయాగాది వైదిక క్రతువులు ఆగిపోయాయి వాటినించి హవిర్భాగాలు నిలిచి పోవడంతో దేవతలు నిస్తేజులయ్యారు





అలా దేవతలు బలహీనులు కాగానే దుర్గమాసురుడు స్వర్గలోకంమీద దండెత్తాడు ఇంద్రుడు స్వర్గం వదిలిపెట్టి పారిపోయి సత్యలోకంలో తలదాచుకున్నాడు అగ్ని, వరుణ, వాయువులు అసురుడి దెబ్బలకి తాళలేక తలా ఒకదారి పట్టారు ఇతర దేవతా గణాలన్నీ విధిలేక అసురుడికి దాసోహమన్నాయి

ఈ విధంగా వేదాలు అసురాధీనమైనందువల్ల యజ్ఞయాగాదులు జరక్క దురాచారాలు వచ్చాయి వాటి ఫలితంగా వర్షమూ, వేదాగ్ని లేక కరువు కాటకాలు ఏర్పడ్డాయి , తపస్సులు జరగనందువల్ల దిక్పాలకులు బలహీనులైనందువల్ల నదులూ చెరువులూ బావులూ అడుగంటి పోయి, వర్షాలు కురవక, పంటలుపండక, త్రాగడానికి ఒక్కచుక్క నీరు కూడా లభించక, పశుపక్ష్యాదులతో సహా భూలోవాసులు నూరేళ్లపాటు భయంకరమైన కరువు కాటకాలతో అల్లాడి పోయారు మానవులు దుఃఖిస్తున్నా కళ్లల్లోంచి కన్నీరు రాక విలవిల్లాడిపోయారు

ఇలా నూరేళ్లపాటు జరిగిన అనంతరం ఇంద్రాదిదేవతలూ, మహర్షులూ, బ్రహ్మ సమక్షంలో చేరి 'ఈ క్షామాన్ని నివారించే ఉపాయం చెప్పమని ' ప్రార్థించారు

బ్రహ్మ విచారగ్రస్తుడై 'వేదాలను అసురుడు అపహరించడంవల్ల యజ్ఞయాగాదులు నిలిచిపోయి వర్షాలు కురవనందువల్ల, ఈ దుర్భర క్షామం ఏర్పడింది వేదాలు తిరిగి మన వశమై వైదిక కర్మలు ప్రారంభమైతేగానీ యీ దుర్భిక్షం నివారణ కాదు వేదము అంటే సాక్షాత్తూ ఆ ఆదిపరాశక్తే కనుక తరుణోపాయంకోసం ఆమెనే ప్రార్థిద్దాం ' అని చెప్పి తానూ వారితో కలిశాడు అప్పుడందరూ జగన్మాతని ప్రార్థించారు

'తల్లీ జగాన్మతా యీ సృష్టికంతటికీ మూలకారిణివి నీవు నీ సంతానం గుక్కెడు నీరు కూడా దొరక్క దాహార్తితో తినతిండి లేక ఆహారార్తితో అల్లాడిపోతోంది తల్లీ నీ సంతతిలా కడగండ్ల పాలవుతుంటే, మాతృమూర్తివి నువ్వు భరించగలవా? మాతా అనుగ్రహించు దీనశరణ్యే యీ జగత్తుని ఉద్ధరించు నీ కరుణా కటాక్షవీక్షణాలతో మమ్మల్ని దయదల్చు జగాలను కాపాడు మమ్ము ఉద్ధరించడానికి నీవు తప్ప వేరు దిక్కు లేరు ' అంటూ హృదయ విదారకంగా ప్రార్థించారు వారంతా ఆ ప్రార్థనలను ఆలకించిన జగన్మాత చతుర్భుజాలతో చేతుల్లో ధనుర్బాణాలూ, గద, శంఖ, చక్రాలతో వారి ముందు ప్రత్యక్షమైంది

'చూడు తల్లీ నీ సంతానమైన భూలోకవాసులు ఆకలిదప్పులతో ఎలా అలమటిస్తున్నారో నువ్వే చూడు ' అని ప్రార్థించారు మునులు, మహర్షులు

జగన్మాత భూలోకాన్ని వీక్షించింది ఏముందక్కడ? ఎటుచూసినా కరువు కాటకాలతో శుష్కించిపోయిన దేహాలు మాతా, నీరు లభించక చిక్కిశల్యమైపోయిన పశుపక్ష్యాదులు వాడి నీరసించిపోయిన మహావృక్షాలు, బీడుబారిన పంటభూములు ఎండిపోయిన బావులు, చెరువులు, నదీనదాలు

'అమ్మా నువ్వు అమ్మలగన్న అమ్మవంటారే అమ్మలకే పెద్దమ్మవంటారే అలాంటి అమ్మవి, మా కష్టాలుచూసి నీ గుండె కరగడం లేదా తల్లీ మా దీనావస్థని చూస్తున్నా నీకు కన్నీరు రావడం లేదా నువ్వు అమ్మవి మమ్మల్ని యిలా కడగండ్ల పాలుచేస్తావా అమ్మా ఎక్కడున్నావు ' అంటూ హృదయవిదారకంగా రోదిస్తున్నారు మానవులు ఆ బిడ్డల దుఃఖాన్ని చూస్తుంటే ఆ తల్లి హృదయం ద్రవించిపోయింది ఆమె నేత్రాలవెంట కన్నీరు ధారాపాతంగా వర్షించసాగింది ఆ కన్నీటినే అమృతజలపానంలా మానవులు తమ గొంతులు తడుపుకోసాగారు





అంతలో ఆ తల్లి విరాట్‌స్వరూపం ధరించింది ఆమె నేత్రాల స్థానంలో శతాక్షులు అంటే నూరు నేత్రాలు ఆవిర్భవించాయి ఆ నూరు నేత్రాలూ ధారాపాతంగా కన్నీటిని వర్షించసాగాయి ఆ విధంగా జగన్మాత తొమ్మిదిరోజులపాటు రాత్రింపగళ్లు వేలాది జలధారలను నిరంతరాయంగా కురిపించింది

ఆ తల్లి కన్నీటిధారలచేత నదీ నదాలూ, చెరువులు, బావులూ, జలాలతోనిండి పరవళ్లు తొక్కాయి భూదేవి జలధారలతో తడిసి సస్యశ్యామలమైంది జనుల, పశుపక్ష్యాదుల దాహార్తి నివృత్తి అయింది

జగన్మాత అలా కన్నీటి జలప్రవాహాలను కురిపించడంతో పాటుగా తన అభయహస్తం ద్వారా అనేక ఫలములను, శాకములను, ఇతర ఆహారపదార్థాలనూ మానవులకీ, పశుపక్ష్యాదులకి అవసరమైన మేతనూ ఆ తొమ్మిదిరోజులూ నిరంతరాయంగా ప్రసాదించింది వాటిని ఆరగించడం చేత భూలోకవాసుల ఆకలిబాధ అంతరించింది

అనంతరం మానవులూ, మునులూ, దేవతలూ తమ గోడు ఆ తల్లికి వినిపించుకుంటూ 'శతనేత్రాలతో వేలాది అశ్రు అమృతాధారలు కురిపించి మా దాహార్తిని తీర్చిన శతాక్షి శాక భక్ష్యాదులతో మా క్షుద్బాధని నివృత్తిచేసిన శాకంబరీ నీ కరుణా కటాక్ష వీక్షణ ధారలతో మేము కృతార్థులమయ్యాము జగత్తును ఉద్ధరించిన జగన్మాతా మా ఇక్కట్ల కన్నింటికీ కారకుడు దుర్గమాసురుడు వాడు వేదములను అపహరించుకపోవడం చేత వైదిక ధర్మకర్మలు జరుగనందున ముల్లోకాలకూ యీ దుస్థితి దాపురించింది తల్లీ నీకు అసాధ్యం అనేదిలేదు నీ అపారశక్తి ముందు ఎంతటి రాక్షసుడైనా ఎదిరించి నిలవలేడు దుర్గమాసురుడు అపహరించిన వేదమాతవు కూడా నీవే కనుక, ఆ అసురుడిని సంహరించి వేదాలను బ్రహ్మాస్థానమునకు చేర్చి జగాలను ఉద్ధరించు ఈ దీనుల ప్రార్థనలను మన్నించి మాకు రక్షణ కల్పించు బిడ్డలను తల్లి తప్ప మరెవరు ఆదుకోగలరు? అందుచేత జగన్మాతవైన నిన్నే మేము శరణు వేడుతున్నాము పాహిమాం మాతా పాహి పాహి ' అని మొరబెట్టుకున్నారు

జనులు, మునులు, దేవతల ప్రార్థనలకి కరిగి, కనికరించిన ఆ తల్లి అభయ ప్రదానం చేస్తూ 'బిడ్డలారా మీ ప్రార్థనలకి సంతసించాను 'దుర్గము' అనగా అభేధ్యమైనది ఎవరిచేతనూ జయింపలేనిది కనుక నేను దుర్గనై అవతరించి ఆ దుర్గమాసురుడిని చీల్చిచెండాడి సంహరించి వేదాలను యధాస్థానం చేరుస్తాను ధర్మప్రతిష్ఠాపన, లోకశాంతి ప్రసాదిస్తాను ఇదే మీకు నా అభయం ' అని అభయ ప్రదానం చేసింది జగన్మాత జనులు, మునులు, దేవతలూ పరమానందంతో ఆ తల్లిని వేనోళ్ల కీర్తించారు

ఆ వార్త దుర్గమాసురుడికి చేరింది వాడు వేదాలను అపహరించాడుకానీ వేదధర్మ విధులు ఒక్కటీ ఆచరించలేదు అందుచేత వేదములు వాడి చెంతనున్నప్పటికీ ఆ వేదజ్ఞాన శక్తి వాడికి అబ్బ లేదు

వాడు తన మిడిమిడి జ్ఞానంతోనే అహంకరిస్తూ దేవతల రాజధానియైన అమరా- శాశ్వితంగా ఆక్రమించుకోడానికి నూరు అక్షౌహిణుల రాక్షససైన్యంతో స్వర్గంమీదకి దండెత్తాడు అక్కడ దేవతాసైన్యాలు రాక్షససైన్యాలను ఎదుర్కొన్నాయి ఇరుపక్షాలమధ్యా పోరు భీకరంగా జరగసాగింది





అయితే పరాశక్తిచేత తప్ప మరెవరి చేతుల్లోనూ చావులేని దుర్గమాసురుడు అమరావతీ నగరాన్ని ఆక్రమించుకోడానికి స్వర్గద్వారాలు చేధించి లోపలికి ప్రవేశించబోయాడు అంతలో

'నిలు అసురాధమా నిలు నిలు ' అంటూ జగన్మాత అంబరాన ప్రత్యక్షమైంది ఆమె కోటిసూర్య ప్రభాసమాన తేజోరూపాన్ని చూసి దుర్గమాసురుడు విస్మయం చెందాడు

'ఓరీ అసురా నిలు నిలు అమరులకు నేను అభయమిచ్చాను నువ్వెంతటి పరాక్రమవంతుడివైనా, నా అభయ ప్రదానమును ధిక్కరించి స్వర్గపురములో అడుగుపెట్టలేవు ఇదిగో ఈ చక్రాయుధమే స్వర్గదుర్గమునకు రక్షాకవచం ' అంటూ దేవి చక్రాయుధాన్ని ప్రయోగించింది

ఆ చక్రాయుధం అనంతకాలచక్రమై స్వర్గపురిని తన మధ్యభాగాన యిముడ్చుకుని ప్రచండ ప్రళయ భీకరాగ్ని జ్వాలలు విరజిమ్ముతూ స్వర్గపురిచుట్టూ మెరుపువేగంతో గిరగిర తిరుగుతూ, నిప్పురవ్వలు విరజిమ్మసాగింది

ఆ చక్రాయుధ ప్రళయాగ్ని సెగలపొగలను అధిగమించలేక ఒక్క అడుగుకూడా స్వర్గంలోకి వెయ్యలేకపోయాడు అసురుడు అయినప్పటికీ వాడు అహంకారంచేత అట్టహాసం చేస్తూ 'మహా మహా బ్రహ్మ, ఇంద్రాదిదేవతలే నన్నేమీ చెయ్యలేక భీతితో నా ముందు తలలు వంచారు శతృభయంకరుడైన యీ దుర్గమాసురుడిని జయించడం అబలవి, ఆడదానివి నీ వల్ల ఏమవుతుంది? దుర్గమాసురుడంటే జయింపశక్యముకాని అసురుడని నాపేరు చాటి చెప్తోంది తెల్సా?' అన్నాడు పొగరుగా

జగన్మాత దశదిశలు దద్దరిల్లేలా పెద్దపెట్టున హుంకరించి 'మూర్ఖా నువ్వు దుర్గముడివైన అసురపదంతో నీతి బాహ్యుడవు, కలుషితుడవు అయ్యావు అసుర అను శబ్దమునందే నాశము అను అంతరార్ధము చేరివుంది మరి నేనో నీవంటి అసురులను సంహరించు దుర్గను జయింప శక్యము కాని దానను నిన్ను సంహరించే నిమిత్తం అవతరిస్తున్న నా దుర్గావతారాన్ని చూడరా ' అని గర్జించింది

మరుక్షణం జగన్మాత విశ్వవిరాట్ స్వరూపం అవతరించింది ఆ విరాట్ స్వరూపాన్నుండి ఫెళఫెళార్భాటాలుచేస్తూ రౌద్రపూరిత వదనంతో, రక్తపానంతో ఎర్రబారిన నాలికతో ఉచ్ఛ్వాశ నిశ్వాసలనుండి సెగలుపొగలు విరజిమ్ముతున్న నాశికతో, రక్తవర్ణ నేత్రాలతో 'కాళికా' రూపం అవతరించింది

ఆ కాళికాదేవి ఫీంకారగర్జనలకు అసురుడు అదిరిపడుతుండగా, దేవి శరీరంనుండి ప్రళయ ప్రభంజన శక్తితో 'తార' అవతారం వెలువడింది ఆ ప్రళయ ప్రభంజన శక్తికి అసురుడు గాలికి కదిలే గడ్డి పరకలా వూగిపోయాడు

అంతలో దేవినుండి భీకర అట్టహాసాలతో కదంతొక్కుతూ 'భైరవి' అవతరించింది అసురుడు అలా నిశ్చేష్టుడై చూస్తుండగా శ్రీవిద్య, ఛిన్నమస్త, భువనేశ్వరి, భగళ, ఎడతెగని పొగలు విరజిమ్ముతూ ధూమ్ర, దండపాశాయుధంతో త్రిపురసుందరి, మృత్యుదండంతో మాతంగిదేవి విరాట్ స్వరూపాన్నుండి అవతరించాయి



ఆ దశవతార మూర్తులూ ఒక్కొక్కటిగా జగన్మాత విరాట్ స్వరూపానికి ఇరుప్రక్కలా ఆవహించి తమ శక్తులన్నింటినీ ఆ తల్లికి ధారదత్తం చేస్తూ దశహస్తాలుగా, దశాయుధాలతో జగన్మాతని అలంకరించాయి ఆ విధంగా దశహస్తాలతో అవతరించిన దుర్గావతారాన్ని చూసి, ఆ ప్రళయ ఉగ్రమూర్తి స్వరూపాన్ని చూస్తూ దుర్గమాసురుడు నిశ్చేష్టుడైపోయాడు

ఆ దుర్గని అలంకరించిన హస్తాలు మామూలు చేతులుకావు అవి ప్రచండ ప్రళయాగ్ని స్వరూప దశయుద్ధ విద్యాశక్తులు

ఆ హస్తాలని అలంకరించిన ఆయుధాలు మామూలు ఆయుధాలుకావు వేలాది దుర్గమాసురులనైనా రెప్పపాటులో సంహరించి చీల్చిచెండాడగల దారుణ మారణాస్త్రాలు

ఆవిడ నేత్రాలు కరుణాపూరితాలైన మామూలు నేత్రాలుకావు చెంద్రనిప్పులు చెరుగుతున్న కోటిసూర్య తీక్షణ నేత్రాలు

ఆమెవి మామూలు నాశికాపుటాలు కావు కాలకూట విషపు భుగభుగ సెగల ఉచ్ఛ్వాస నిశ్వాసాలను విరజిమ్ముతున్న అగ్నిపర్వతాగ్రాలు

ఇక ఆవిడ దంతాలు కొండనైనా నలిపి నుగ్గునుగ్గు చెయ్యగల కరాళ దంష్ట్రాలు ఆవేశ కావేశాలతో బయటికీ లోపలికీ అమితవేగంతో సాగుతున్న ఆమె నాలుక, బుసలు కొడుతున్న కాలసర్ప విజృంభణ

అట్టి రౌద్ర, ఉగ్ర, రోషపూరిత దుర్గావతారాన్ని చూస్తూ అసురుడు మతిచలించిన వాడిలా 'ఇది ఆడదికాదు మహాశక్తి అసురులారా యీ ఆదిశక్తిని తుదముట్టించండి ' అని అరుస్తూ ఓంద్రపెట్టాడు అసురసైన్యం దుర్గమీదకి బాణాలూ, ఖడ్గాలూ, గదలూ, శూలాలూ తదితర మారణాయుధాలు మూకుమ్మడిగా ప్రయోగించింది

'రేయ్ ఎవఁడ్రా అభేద్యమైన దుర్గను జయించగల వాడెవడ్రా ' గర్జిస్తూ దశదిశలూ దద్దరిల్లేలా ప్రళయాట్టహాసం చేసింది దుర్గాదేవి ఆ క్షణమే ఆమె నేత్రాలనుండి జ్వలించిన అగ్ని జ్వాలలు తాకి కొందరు అసురులు భగ్గున మండి బూడిదైపోగా ఆమె నాసికలనుండి వెలువడిన సెగల భుగభుగల వేడికి మరికొందరు మాడి మసైపోయారు మరికొందరు కాలసర్పము వంటి ఆమె నాలికా విషాగ్నికీలలకు ఆహుతికాగా ఇంకొందరు ఆ నాలికపై నుండి పైకెగసి ఆమెనోటి దంతాల మధ్య పటపట నలిగి నజ్జు నజ్జుగా నాశనమైపోయారు

అలా అసురసైన్యమంతా ఆహుతి అయిపోతూంటే దుర్గమాసురుడు భరించలేక 'ఓసీ చూడు, నిన్నేం చేస్తానో ' అని అరుస్తూ ఆమెపైకి లంఘించబోయాడు అంతలో

'రేయ్ ' భీకర గాండ్రింపుతో దుర్గ తనవామపాదాన్ని ఎత్తి అసురుడిని నేలకూల్చి పాదంతో వాడిని అదిమి పట్టింది ఆ పాద ఘట్టనకి తాళలేక అసురుడు దిక్కుతోచక ప్రాణభయంతో విలవిలాడుతుండగా కాళికా శక్తిరూపయైన త్రిశూలం దుర్గామాతయొక్క కాళికాహస్తమందు తళుక్కున ప్రత్యక్షమైంది

దుర్గమాసురుడు భయభ్రాంతుడై దేవిపాదం క్రిందనించి తప్పించుకోలేక పెనుగులాడు తుండగా కాళికాహస్తము నలంకరించిన త్రిశూలము అగ్నిసెగలు విరజిమ్ముతూ అసురుడి గుండెను చీల్చి పారేసింది వాడి గుండెలనుండి ప్రవాహంలా పెల్లుబికిన రక్తధారలను దుర్గనాలిక చుక్క మిగలకుండా ఆస్వాదించి త్రాగేసింది అంతటితో దుర్గమాసురుడు అంతమయ్యాడు వాడివద్ద నున్న తాళపత్రరూప వేదాలు దుర్గామాత హస్తాన్ని అలంకరించాయి



దుర్గమాసురుడిని సంహరించిన దుర్గాదేవిమీద అమరులు అంతరిక్షంనుండి పుష్పవర్షం కురిపించారు జయజయధ్వనులు చేశారు అసురసంహారం కోసం ధరించిన ఆ ఉగ్రరూపాన్ని శాంతింపచెయ్యడానికి బ్రహ్మాది దేవతలూ, మునులూ, మానవులు దుర్గాదేవిని అనేకానేక స్తోత్రములతో స్తుతించారు అప్పుడు దుర్గాదేవి శాంతించి తన ఉగ్రరూపాన్ని ఉపసంహరించుకుని చతుర్భుజాలతో, ప్రసన్న మందహాస వదనంతో జగన్మాతగా అవతరించి వేదాలను బ్రహ్మదేవునికి అప్పగించింది ఆనాటినించే చతుర్ముఖుడి చేతిలో వేదాలు సాకారంగా దర్శనమిస్తున్నాయి

అప్పుడు దుర్గాదేవి త్రిలోకాలవాసులకూ మరోసారి అభయమిస్తూ 'వేద ధర్మహితమైన జ్ఞానబుద్ధిచేత నన్ను ప్రార్థించినవారికి దుర్గగా ప్రత్యక్షమై అభయమిచ్చి ఆదుకుంటాను అనుగ్రహించి వరాలు ప్రసాదిస్తాను అజ్ఞానాంధకారంతో విర్రవీగుతూ అసురప్రవృత్తితో చెలరేగుతూ లోకకంఠకులుగా మారిన వారిని దసహస్త స్వరూప అపర దుర్గాదేవిగా మారి దండించి లోకాలనూ సంరక్షిస్తాను వృద్ధీనాదే క్షయమూ నాదే ఇదే ఈ దుర్గావతార మహాత్మ్యం ఈ సత్యాన్ని ఎల్లవేళలా గ్రహించి సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసా మార్గాలను పాటిస్తూ ఆయురారోగ్య సౌభాగ్యాలతో, సుఖశాంతులతో వర్ధిల్లండి ' అని సర్వులనూ ఆశీర్వదించింది

'శతాక్షీమాతకీ జై శాకంబరీ మాతకీ జై దుర్గామాతకీ జై జగన్మాత ఆదిపరాశక్తికీ జై ' అంటూ త్రిలోక వాసులూ జయజయ ధ్వానాలు చేశారు అంబ అందరినీ మరోమారు ఆశీర్వదిస్తూ అంతర్ధానమైంది

ముగురమ్మల్లో ఒకరైన దుర్గమ్మ అవతార గాధ ఇది ఈ ఉదంతం యావత్తూ వ్యాస భగవానుడి దేవీ పురాణంలో అక్షరబద్ధం చెయ్యబడింది

జగన్మాత అంశయే యీ దుర్గ ఆ తల్లి మరో అంశగా సరస్వతీ దేవిగా బ్రహ్మవాక్కునందు నివశిస్తుంది ఆవిడ లోకసంరక్షణకు మరే రూపంలో అవతరించిందో, ఆగాధ, దేవీ పురాణంలో యీ విధంగా వుంది

## సరస్వతీ అవతారం - శుంభు, నిశుంభుల సంహారం

ఒకప్పుడు పాతాళలోకాన్ని శుంభు, నిశుంభులను రాక్షస సోదరులు పాలించేవారు వారిద్దరూ ఘోరతపస్సు చేసి అనేక మహిమాన్వితములైన అణిమాణిక్యాది సిద్ధశక్తులను సంపాదించారు ఆ బలదర్పంతో వారు ఆ పాతాళ రాజ్యాలన్నింటినీ జయించి తమ పాదాక్రాంతం చేసుకున్నారు పాతాళలోకం యావత్తూవారి ఆధీనంలోకి రాగానేవారు మరింత విజృంభించి అమరుల రాజధానియైన అమరావతిమీద దండెత్తారు ఆ రాక్షస సోదరులు అమిత బలపరాక్రమవంతులనీ, దేవగణాలతో ఎదిరించి వారిని జయించడం సాధ్యంకాదని గ్రహించిన ఇంద్రాదిదేవతలు స్వర్గాన్ని విడిచిపెట్టి పారిపోయారు కొన్ని దేవగణాలు రాక్షససైన్యాలను ఎదిరించాయిగానీ, వారిని జయించలేక తలో దిక్కూ పారిపోయాయి అమరావతి దైత్యుల వశమైంది



'ఎక్కడరా, రంభా ఊర్వశీ మేనకా తిలోత్తమలు? ఆ అప్సరసాంగనలను చెరపట్టి తక్షణం మన పాతాళలోకానికి తరలించండి ' అని ఆజ్ఞాపించాడు శుంభుడు

నిశుంభుడు కల్పించుకుని 'అన్నా ఆ కామధేనువు, కల్పవృక్షం, ఐరావతములను కూడా మన రాజధానికి తరలించేస్తే, ఈ స్వర్గం బోసిపోయి స్మశానంలా అవుతుంది అదే కదా మన బలపరాక్రమాలకి దర్పణం ' అన్నాడు

'అలా, సరిపెట్టుకుంటే మీరు అసమర్థులైనట్లే ' అంటూ ప్రత్యక్షమయ్యాడు నారదుడు

శుంభుడు అతడివైపు తీక్షణంగా చూస్తూ 'నారదా నీ మాయమాటలతో మమ్మల్ని మోసం చెయ్యాలని చూస్తున్నావా?' గద్దించాడు

'మోసం కాదయ్యా బాబూ, మాయ ఆ మాయ కమ్మినవారు మీలాగే చిన్నచిన్న ప్రయోజనాలకీ, ప్రలోభాలకీ లొంగిపోతారు ఆ మాయని వదిలించుకోమని చెబుతున్నా' నన్నాడు నారదుడు

'అంటే ?' రెట్టించాడు నిశుంభుడు

నారదుడు నవ్వి 'అప్సరసలతోపాటు మీరు కోరుకున్నవన్నీ మీరు తీసుకుని మీ దారిన మీరు పోతారు కొద్దికాలం యీ అమరావతి పాలకుడు లేక స్వశానంగా మారవచ్చు కానీ, మళ్లీ అమరులు రాకపోరు ఇంద్రుడు సింహాసనాన్ని అధిష్టించకపోడు గదా?' అన్నాడు

'వాడా, పిరికిపందలా మాకంటపడే ధైర్యంకూడా లేక పారిపోయిన ఆ దేవేంద్రుడా? వాడికి అంత ధైర్యమా?' అన్నాడు శుంభుడు గర్వంగా

'ధైర్యం అతడిది కాదయ్యా, అతడికీ దేవతలకీ ధైర్యాన్నీ ఇస్తున్న యజ్ఞా హవిర్భావానిది ఆ శక్తి యజ్ఞాయాగాదులచేత లభించే హవిస్సుచేతనే దేవతలు అమరులయ్యారు మాయకమ్మడం చేత మీరు యీ యధార్థాన్ని గ్రహించలేక తైతక్కలాడే అప్సరసలతో, ఆ తెల్ల ఏనుగు, కామధేనువూ, కల్పవృక్షాలతో సరిపెట్టుకుని ఓహోయని పొంగిపోతున్నారు ' అని ఎత్తిపొడిచాడు నారదుడు

'అయితే, ఇకనించి యజ్ఞయాగాదులచేత లభించే హవిర్భాగం యావత్తూ మా దైత్యసోదరులకే చెందాలి సోదరా నిశుంభా! తక్షణం మా శాసనాన్ని ముల్లోకాల్లో ప్రకటించు యజ్ఞ హవిస్సును మనకి యివ్వడానికి నిరాకరించిన మునులు, మహర్షులను దండించండి అట్టి యజ్ఞయాగాలను ధ్వంసం చెయ్యండి ఆ హవిస్సు మనకి చెందకపోయినా ఫర్వాలేదు ఆ దేవతలకి మాత్రం చెందకూడదు ఇది మా ఆజ్ఞ' అని శుంభుడు ప్రకటించి 'ఏమంటావన్నట్లు?' నారదుడివైపు చూశాడు

'భళీ భళీ తెలివంటే అలా వుండాలి ' అని ప్రశంసించాడు నారదుడు

శుంభుడు గర్వంగా మీసం మెలివేశాడు నిశుంభుడునవ్వి 'అన్నట్లు నారదా, ఇందాక మాయ అన్నావు ఆ మాయ ఎవరు? ఎక్కడుంటుంది?' అడిగాడు అనుమానంగా

'మాయా అబ్బో ఆ మహామాయ గురించి తెల్సుకోవడం బ్రహ్మ విష్ణువులకే సాధ్యం కాదు అయినా నేను త్రిలోకసంచారిని కదా నా లోకసంచారంలో ఎక్కడైనా ఆ మహామాయ కన్పిస్తే ఆఘమేఘాలమీదవచ్చి వివరాలు మీ చెవినవేస్తా సరేనా?' అని చెప్పి అదృశ్యమై పోయాడు నారదుడు

ఇక శుంభ నిశుంభుల శాసనం ముల్లోకాల్లోనూ ప్రకటించబడింది దేవతలకిచెందే



హవిర్భాగాలను దైత్యులకి యివ్వడానికీ, వారి పేరిట యజ్ఞయాగాలు జరపడానికి మునులు, మహర్షులు నిరాకరించారు అలాంటి వారందరినీ రాక్షసులు అనేక విధాల హింసించారు యజ్ఞ వాటికలను ధ్వంసం చేశారు యజ్ఞకుండాల్లో రక్తమూ, మధువూ కుండలతో కుమ్మరించి వాటిని అపవిత్రం చేశారు లోకాలన్నీ రాక్షసుల హింసాకాండకి తల్లడిల్లిపోతూ హాహాకారాలు చేశాయి

అలాంటి సమయంలో నారదుడు,ఇంద్రాది దేవతలను వెంటబెట్టుకుని హిమవత్పర్వతాలకి వెళ్లాడు అక్కడ పరమేశ్వరునితో కల్సి అదృశ్యరూపంలో నివశిస్తున్న జగన్మాతని స్మరిస్తూ అందరూ ప్రార్థించారు వారిమొరలాలకించి జగన్మాత సింహవాహినియై ప్రత్యక్షమైంది

'అమ్మా ఈ సృష్టి సమస్తం నీ సంకల్పానుసారం చరిస్తోంది నీకు తెలియనిదేముంది?' అన్నాడు నారదుడు నిష్టూరంగా, 'శుంభ నిశుంభులను రాక్షసులను సృష్టించిందికూడా ఆవిడేకదా' అన్న అంతరార్థం ధ్వనించేలా

జగన్మాత నవ్వి 'నాయనా, యీ సృష్టి జీవులన్నీ నా సంకల్ప ప్రభావంచేతనే జన్మిస్తున్నాయి గానీ, మరే జీవికిలేని విధంగా దేవతలకూ, మానవులకూ, దానవులకూ స్వయంగా ఆలోచించి యుక్తాయుక్త విచక్షణ చేసుకునే బుద్ధీ, జ్ఞానాలను ప్రసాదించాను ధర్మాన్ని గుర్తించి ఆచరించే స్వేచ్ఛనిచ్చాను మరికొందరు జీవులు బుద్ధిజ్ఞానాలను వక్రమార్గం పట్టించుకుని, ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తే అది నా తప్పా? అద్భుతమైనా మితిమీరి సేవించినా, ఆలశ్యంగా సేవించినా అది విష తుల్యమవుతుంది కదా! అయినా, ఇలా ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తూ లోకకంఠకులుగా తయారైన వారిని నేను దండించి, సంహరిస్తున్నాను కదా?' అంది

నారదుడు సిగ్గుపడి 'అమ్మా, నా అజ్ఞానాన్ని మన్నించు ' అని ప్రార్థించాడు

'అజ్ఞానాన్నే మాయ అంటారు నాయనా ఆ మాయా స్వరూపాన్ని కూడా నేనే కావాలంటే చూడు ' అని నవ్వింది జగన్మాత

మరుక్షణం జగన్మాత దేహమునుండి ధవళకాంతులు విరజిమ్ముతూ అంశారూపం ప్రత్యక్షమైంది ఆ ధవళ స్వరూపిణి తెల్లనిదుస్తులు ధరించి ఒకచేత అక్షరమాలనూ, మరొకచేత వీణనూ, కమలంమీద ఆశీనురాలై అద్భుతమైన తేజస్సుతో ప్రకాశిస్తోంది ఆమెని తన మాతృమూర్తి సరస్వతీదేవిగా గుర్తించిన నారదుడూ, ఇంద్రాదులూ చేతులు జోడించి భక్తి ప్రపత్తులతో నమస్కరించారు

సరస్వతి పాలనురుగులాంటి మందహాసంచేసి 'నాయనా వేదజ్ఞానంచేతా, ఆత్మజ్ఞానం చేతా నన్ను తెల్సుకున్నవారికి నేను కోరినవిద్యలు ప్రసాదించే సరస్వతిని అజ్ఞానంచేత నన్ను తిరస్కరించి, దూషించే వారికి వారి అజ్ఞానరూపమైన మహామాయని నేనే మహామాయ ఉనికి తెల్సుకుంటానని శుంభ నిశుంభులకు [illegible] కదా వెళ్లి చెప్పు ' అంది

'అర్థమైంది తల్లీ నీ మాయానాటకంలో నన్ను సూత్రధారిని ఎందుకుచేశావో ఇప్పుడు అర్థమైంది ' అన్నాడు నారదుడు మరోసారి భక్తితో చేతులు జోడించి నమస్కరిస్తూ జగన్మాత మందహాసం చేసి అంతర్థానమైంది

నారదుడు తన తల్లి సరస్వతీ దేవిని వీక్షిస్తూ 'అమ్మా జ్ఞానప్రదాయినీ నువ్వు జగన్మాత

అంశమని తెల్సికూడా, నా అజ్ఞానంచేత ఇంతకాలం నువ్వు నాకేతల్లివని భావించి గర్వంతో విర్రవీగాను కానీ చదువుల తల్లివైన నువ్వు సమస్తలోకాలకీ తల్లివేనన్న సత్యాన్ని ఇప్పుడు గ్రహించాను నా అపరాధాన్ని క్షమించు'అని ప్రార్థించాడు

వాణి మందహాసంచేసి 'మళ్ళీ మాయలో పడుతున్నావా నారదా ఇప్పుడా మాయా ప్రభావానికి చిక్కవలసింది ఆ దైత్యసోదరులూ, వారి అనుచరులూ ' అని హెచ్చరించింది

'అర్థమైంది తల్లీ అర్థమైంది ' అని నారదుడు పాతాళానికి బయల్దేరాడు

పాతాళరాజ్యంలో అప్సరసల నృత్యగానాలతో వినోదం పొందుతున్న దైత్యసోదరులు, నారదుని రాకతో వాటిని తాత్కాలికంగా విరమించి, 'నారదా, ఎక్కడ మీ ఇంద్రాది దేవతలు?' అని అడిగారు హేళనగా

నారదుడు నవ్వి 'వారికేం వారు క్షేమంగా వున్నారు మహామాయ రక్షణలో ' అన్నాడు నర్మ గర్భంగా

శుంభుడు ఉలిక్కిపడి 'మహామాయా? ఆడదేనా?' అన్నాడు

'అందగత్తేనా?' రెట్టించాడు నిశుంభుడు

'ఆడదీ, అందగత్తె కాదు అలాంటి అందగత్తెని నా జన్మలో మరొకరిని చూడలేదయ్యా బాబూ ఈ రంభా ఊర్వశీ మేనకా తిలోత్తమలు ఆమె కాలిగోటికి సరితూగరనుకో ఆవిడ భువనైక జగన్మోహిని ' అన్నాడు నారదుడు

అయితే అలాంటి జగన్మోహిని పొందు మాక్కావాలి మా బలపరాక్రమాలచేత నయానో, భయాన్నో ఆ ఆడదాన్ని మా సొంతం చేసుకుంటాం ఎక్కడుంది నారదా, ఆ మాయా జగన్మోహిని?' అడిగాడు శుంభుడు

'హిమాలయా పర్వత శ్రేణుల్లో కమలపుష్పంమీద తెల్లటి వస్త్రాలతో ధవళరూపిణిలా మెరిసిపోతోందనుకో ', అని ఊరించాడు నారదుడు

నిశుంభుడు ఆ మాటలకే కామోద్రేకుడై 'చండాముండులారా ' అంటూ ఒక్కపొలికేక పెట్టాడు మరుక్షణం చండ, ముండులు అనే ఇద్దరు రాక్షసులు వారి ముందు ప్రత్యక్షమయ్యారు

'హిమాలయ పర్వతాలలో తెల్లటిదుస్తులు ధరించి కమలంమీద నివశిస్తున్న జగన్మోహినిని కనిపెట్టండి, ఆమెకి మా సోదరుల బలపరాక్రమాలు వివరించి నయానో, భయానో మా దాన్ని చేసి తీసుకురండి పొగరుతో తిరస్కరించిందో బలాత్కారంగా బంధించి యీడ్చుకురండి మన దర్పానికి తగ్గట్టు తగినంత రాక్షస బలగాన్ని మీ వెంట తీసుకువెళ్ళండి ' అని ఆజ్ఞాపించాడు శుంభుడు

'అదీ పౌరుషం అంటే దానవ చక్రవర్తి అంటే యింత దర్పంగా వుండాలి మరి నాకు శెలవు ' అని అంతర్ధానమైపోయాడు నారదుడు

శుంభుడి ఆజ్ఞానుసారం చండుడు, ముండుడు రాక్షససైన్యాన్ని వెంటబెట్టుకుని హిమాలయాలకు వెళ్ళారు ఆ పర్వతశ్రేణులలో మహామాయ ఎక్కడున్నదో వారు కనిపెట్టలేక తమ సహచరుడైన ధూమ్రలోచనుడితో 'ఈ పర్వతాలలోని మంచుచేత మా రక్త నాళములు గడ్డకడుతున్నాయి మేము కొంచెం విశ్రాంతి తీసుకుని రక్తపానంచేసి మా రక్త నాళాలను ఉత్తేజితం చేసుకుంటాము ఈలోగా నీవువెళ్ళి ఆ మోహిని జాడ కనిపెట్టి ఆమె మనతో రావడానికి నిరాకరిస్తే బంధించు ' అని ఆజ్ఞాపించారు

ధూమ్రలోచనుడు తన కళ్ళవెంట నిప్పులు, పొగ ధారాపాతంగా కురిపిస్తూ మంచును



కరిగిస్తూ దారి చేసుకుని ముందుకు వెళ్లాడు వాడివెంట అరవైవేలమంది రాక్షసభటులు అనుసరించారు

చండాముండులు తమ వెంటతెచ్చిన అశ్వాలు, గజాలని చంపి వాటిరక్తాన్ని త్రాగుతూ విశ్రాంతి పొందసాగారు (చండాముండులు రెండువైపులా తలలున్న రక్తపింజం అను సర్పములా ఏక శరీరులని కూడా అంటారు)

ధూమ్రలోచనుడు కైలాసశిఖర ప్రాంతాన్ని సమీపించి, అక్కడ కమలవాసినియై, అష్టబాహువులతో ధవళకాంతులతో విరాజిల్లుతున్న మహామాయని చూశాడు ఆమెని సమీపించి 'సుందరీ నారదుడు చెప్పిన దానికంటే మిన్నగా వున్నది నీ సౌందర్యము ఇంతటి సౌందర్యంతో విరాజిల్లే నువ్వు యీ మంచుపర్వతాల్లో ఎలా సుఖపడతావు? మా దానవ చక్రవర్తులు శుంభ నిశుంభులు నీ పొందు కోరుతున్నారు వారి కోర్కెతీర్చి స్వర్గ సుఖాలను అనుభవించు మా వెంటరా ' అన్నాడు

మాయాస్వరూపిణి అయిన సరస్వతి మందహాసంచేసి 'ఓరి అజ్ఞానీ నేనెవరినను కుంటున్నావు? ఈ ముల్లోకాలకూ సృష్టికర్త ఎవరో అతడి పొందుకోసం అవతరించినదాన్ని అతడికి తప్ప అన్యులకు తల్లిని ఈ కృతయుగాంతము సమీపిస్తుండడంచేత ధర్మము అడుగంటి తల్లిని కామించే చెడ్డబుద్ధులు మీ అసురులకు కలుగుతున్నాయి సద్బుద్ధి కలిగి మర్యాదగా మీ పాతాళలోకానికి వెళ్లి ఇకనైనా ధర్మ ప్రవర్తనులై సంచరించండి లేదా మీ బూడిదకుప్పలు యీ హిమసమూహాల్లో కల్సి కరిగిపోతాయి జాగ్రత్త' అని హెచ్చరించింది

ధూమ్రలోచనుడు ఆ మాటలకి మండిపడుతూ 'ఆడదానివనీ, అందగత్తెవనీ ఆలోచిస్తుంటే, ఏవిటే, ఒళ్లు పొగరెక్కి వాగుతున్నావు? నా కంటి మంటలతో యిప్పుడే నిన్ను కాల్చి భస్మం చేస్తా, చూడు ' అని హుంకరిస్తూ కళ్లల్లోంచి నిప్పులూ పొగలు కురిపిస్తూ మహామాయ మీదకి లంఘించబోయాడు

'ఓరోరీ నిలు నిలు ' గర్జించింది సరస్వతి మరుక్షణం ఆమె సింహవాహినియై ఆదిశక్తిగా రూపు దాల్చింది ఆమె వాహనమైన సింహరాజము దిశలు దద్దరిల్లేలా భయంకరంగా గాండ్రు గాండ్రుమని గర్జిస్తుంటే ఆ సింహగర్జనలకు రాక్షసభటుల గుండెలు భయ ప్రకంపనలతో విలవిల్లాడిపోయాయి

అంతటి భయంకరమైన సింహరాజాన్ని వాళ్లు అంతకు ముందెప్పుడూ చూసివుండలేదు ధూమ్రలోచనుడు కూడా ఆ దేవీస్వరూపాన్ని చూసి క్షణంపాటు తత్తరిల్లి, మరుక్షణమే తేరుకుంటూ 'సింహాలూ, ఏనుగుల రక్తపానంతో మదించిన వాళ్లం నిన్నూ నీ సింహాన్ని ఒక్క క్షణంలో నా కంటి మంటలతో కాల్చి బూడిద చేస్తాను, చూడవే ' అని అరుస్తూ జగన్మాతమీదకి ఉరకబోయాడు

మరుక్షణం 'హూం ' అంటూ ఒక్కసారి హుంకరించింది దేవి ఆమె హుంకారంలోనించి పుట్టిన అగ్నిజ్వాలకి ధూమ్రలోచనుడు నిలువునా కాలి బూడిదైపోయాడు

అదేక్షణంలో దేవీవాహనమైన సింహరాజం పెద్దగా గాండ్రిస్తూ అసుర భటులమీదకి లంఘించి దొరికిన వారిని దొరికినట్టు కొరికి చంపి చీల్చి చెండాడసాగింది ఆ సింహరాజం బారినుండి తప్పించుకున్న అతికొద్దిమంది రాక్షసులు పారిపోయి రక్తబీజులైన చండాముండులకు జరిగిన విషయాన్ని విన్నవించారు

ఆ వార్తవిన్న చండాముండులు మండిపడుతూ 'ఛీఛీ, మూర్ఖుల్లారా సింహాలను సెతం



అవలీలగా చంపి వాటి రక్తం త్రాగుతుండటంచేత మాకు రక్త బీజులనే పేరు వచ్చింది అలాంటి మా భటులైన మీరు ఒక సింహానికి ఒక ఆడదానికీ జడిసి పారిపోయి వస్తారా? వాటి సంగతి మేము చూస్తాం ' అని హుంకరిస్తూ వాళ్లిద్దరూ తమ సైన్యాన్ని వెంటబెట్టుకుని కైలాస పర్వత ప్రాంతానికి చేరుకున్నారు అక్కడ వారికి సింహవాహనంమీద దేవి కనిపించింది ఆమె అష్టబాహువులతో ఆయుధాలను ధరించివున్నా ఆమె సౌందర్యం వాళ్లని మంత్రముగ్ధులను గావించింది

'దేవీ, సింహంమీద కూర్చుంటేనే నువ్వింత సౌందర్యంతో ప్రకాశిస్తున్నావే మరి మా దైత్యసింహాలు శుంభనిశుంభలుల అంకపీఠం మీద కూర్చుంటే మరెంతటి సౌందర్యంతో శోభిస్తావో ఒక్కసారి ఆలోచించుకో మర్యాదగా మా మాటవిని మా 'వెంటరా మా దానవ చక్రవర్తుల పొందుకోరి సుఖించు ' అన్నాడు చండుడు

జగన్మాత వారిపైపు ఆగ్రహంగా చూస్తూ 'ఓరీ మృత్యువు పొందుకోరి వచ్చారు కాబట్టే మీ నోటివెంట యిలాంటి ప్రగల్భాలు వస్తున్నాయి మీ ధూమ్రలోచనుడికి ఏ గతి పట్టిందో మీరే ఆలోచించుకుని వెనుతిరిగిపొండి ' అని హెచ్చరించింది రౌద్రపూరితస్వరంతో

'ఆహో చండా ఇది మాటలతో లొంగే ఆడది కాదు దీన్ని పట్టి బలాత్కారంగా యీడ్చుకు వెళ్లాల్సిందే ' అంటున్నాడు ముండుడు అహంకారంతో

వారి మాటలు పూర్తిగాకముందే వాడి దూషణ వాక్యాన్ని భరించలేనట్లు దేవి పెద్దపెట్టున హుంకరించి 'ఓరీ ఈ క్షణంతో నీ ఆయువు చెల్లు ' అని గర్జిస్తూ చక్రాయుధాన్ని విసిరింది

మరుక్షణం ఆ చక్రాయుధం మెరుపు మెరుస్తున్నట్లు గిర్రుగిర్రున తిరుగుతూ దూసుకువెళ్లి రెప్పలో ముండుడి కంఠాన్ని ఖండించింది వాడి శిరస్సు తెగి మొండెంనించి వేరై బంతిలా పైకెగిరింది వాడి మొండెంలోనుండి ఉవ్వెత్తున పైకెగసిన రక్తధారని జగన్మాత నాలిక చాచి బొట్టు నేలరాలకుండా క్షణంలో పీల్చిపారేసింది వాడిమొండెమూ, పైకెగిరిన శిరస్సూ ఒకేసారి నేలకూలి దేవి కంటినొంచి తీక్షణంగా వెలువడిన ఒక కిరణజ్వాలకి భగ్గునమండి బూడిదై పోయాయి

ఆ హఠాత్పరిణామానికి నివ్వెరపోయాడు చండుడు మరుక్షణమే తెప్పరిల్లి 'ఓసీ సుందరివి కదా అని కనికరిస్తే ఎంత పనిచేశావే ఇహ నిన్ను వదలనుగాక వదలను ' అని గాండ్రిస్తూ ఆమె మీదకి శరపరంపరగా బాణాలు ప్రయోగించాడు ఆ బాణాలన్నీ దేవిని తాకకముందే ఆమెకంటి మంటలకి బూడిదైపోయాయి

చుండుడు ఆగ్రహంతో ఖడ్గాన్ని దూసి ఓసీ యీ ఖడ్గ ప్రహారంతో నీ పని సరి ' అని గర్జిస్తూ ఆమెమీదకి లంఘించాడు

అలా తన మీదకి లంఘించిన చండుడిని దేవి ఒకచేత ఒడిసిపట్టుకుని మరోచేతిలో ప్రత్యక్షమైన ఛురికతో వాడి కంఠములో పొడిచి ఆ కంఠనాళములోంచి ఉవ్వెత్తున పైకెగసిన వాడి రక్తాన్ని తన నాలికతో పూర్తిగా పీల్చిపారేసింది

రక్తహీనుడైన ఆ రక్తబీజ చండుడు ప్రాణాలు కోల్పోయి వాడి నిర్జీవ కళేబరం దేవి చేతిలోంచి నేలరాలుతూ మధ్యలోనే ఆమె నేత్రాగ్ని జ్వాలలకి భగ్గునమండి బూడిదైపోయింది ఆ నేత్రాగ్ని జ్వాల దావాగ్నిలా చెలరేగి వ్యాపించి రెప్పపాటులో అక్కడున్న రాక్షసులనందర్నీ మాడ్చి మసిచేసి పారేసింది

ఆ వార్త ఒక భటుడిద్వారా శుంభనిశుంభులకి చేరింది నిశుంభుడు ఆగ్రహంతో



వూగిపోతూ 'అన్నా అది మామూలు ఆడదిలా తోచడంలేదు మన దైత్యకులాన్ని మట్టుబెట్టడానికి అవతరించిన మహమ్మారిలా వుంది ' అన్నాడు

'అయినా ఆడదీ, సౌందర్యరాశిగదా దాని సౌందర్యాన్ని అనుభవించకుండా వదిలేస్తామా?' అన్నాడు శుంభుడు కామప్రకోపంతో

'అయితే నేనేవెళ్లి దాన్ని బలాత్కరించి మన రాజ్యానికి యీడ్చుకొస్తాను ' అంటూ నిశుంభుడు అనేక శస్త్రాస్త్రాలను ధరించి అశేష రాక్షససైన్యాన్ని వెంటబెట్టుకుని కైలాసపర్వత ప్రాంతానికి చేరుకున్నాడు అక్కడ సింహరాజ వాహనంమీద అపురూప సౌందర్యంతో భువనమోహినిలా కన్పించిన దేవిని చూడగానే వాడికి కామంతో కళ్లకి పొరలు కమ్మాయి

'ఆహో ఏమి నీ సౌందర్యం ఇంతటి సుకుమారివైన నీకు భయంకరాకృతి కలిగిన యీ సింహరాజంకంటే మా అన్నదమ్ముల అంకపీఠాలే సురక్షితమైనవి కోమలమైన నీ హస్తాలు ఆయుధాలు ధరించి కమిలిపోవడంకంటే మా సోదరుల వలపు కౌగిళ్లల్లో పరవశించి సుఖించడమే మేలు సుందరీ ఈ అవకాశాన్ని జారవిడవకు మృత్యువాతపడకు మమ్ము అనుగ్రహించి మా పొందుతో స్వర్గసుఖాలు అనుభవించు రా 'అన్నాడు మదోన్మత్తుడైన నిశుంభుడు

దేవి అట్టహాసంచేసి 'కామాంధకారంతో తల్లిపొందునే ఆశిస్తున్న మూర్ఖా నీకు చేటుకాలం దాపురించబట్టే వదురుతున్నావు మృత్యువునైన నాకే మృత్యువా ? నేటితో నీ ఆయువు మూడిందిరా ' అని గర్జించింది

నిశుంభుడు రెచ్చిపోతూ 'చూపించవే నీ ప్రతాపం ' అంటూ అనేక మారణాస్త్రాలను తన రాక్షస విద్యతో ఒకేసారి దేవిమీదకి ప్రయోగించాడు

దేవి ఒక్కసారిగా విరాట్‌విశ్వరూపాన్ని ధరించి ఆ మారణాస్త్రాలన్నింటిని క్షణంలో బుగ్గి చేసింది

దేవి విరాట్‌స్వరూపాన్ని చూస్తూ నిశ్చేష్టుడైన నిశుంభుడు 'నువ్వు సౌందర్యరాశివికావే మహమ్మారివి దైత్యవంశనాశినివి నిన్ను నా స్వీయ రాక్షస మాయాశక్తితో నిర్జించి నీ మృత దేహాన్ని ' అంటున్నాడు పేట్రేగిపోతూ

వాడి ప్రేలాపనలు పూర్తిగాకముందు 'దూర్తా ఇదే ఈ శక్తి పాశంతో నీ ఆయువు చెల్లు ' అంటూ శక్తిపాశాన్ని ప్రయోగించింది దేవి ఆ శక్తిపాశం కాలసర్పంలా బుసలు కొడుతూ, చెండ్ర నిప్పులు కక్కుతూ వాయువేగంతో దూసుకువచ్చి నిశుంభుడి గుండెల్లోకి దూసుకుపోయింది మరుక్షణం వాడి బూడిద కూడా మిగలకుండా శక్తిపాశానికి ఆహుతి అయిపోయాడు

ఆ అసురునితో శాంతించని శక్తిపాశం ఆకలి ఆకలి ఆహారం ఆహారం ' అనీ పెడబొబ్బలు పెడుతూ చండప్రచండంగా వ్యాపించి రాక్షససైన్యాన్నంతటినీ రెప్పపాటులో ఆహుతి చేసుకుంది వారు ఆ దావాగ్నిపాశానికి ఆహుతి అయిపోతూ చేసిన ఆర్తనాదాలు 'శుంభా శుంభా ' అంటూ పాతాళందాకా వినిపించాయి







శుంభుడు ఆ ఆర్తనాదాలచేతనే జరిగిందేమిటో గ్రహించాడు వాడు తన అసుర విద్యాశక్తిచేత అష్టబాహువులు సృష్టించుకుని, ఆ ఎనిమిది చేతులా అనేక మారణాయుధాలు ధరించి జగన్మాత ముందు ప్రత్యక్షమయ్యాడు

'ఓసీ మాయావీ నువ్వు నా దళపతులైన చండ, ముండ, ధూమ్రలోచనులను వధించావు నా అశేష రాక్షససైన్యాన్ని నీ పొట్టనబెట్టుకున్నావు చివరికి నా తమ్ముడైన నిశుంభుని కూడా సంహరించావు నీ మహామాయా నిజస్వరూపమేమిటో నాకిప్పుడు అర్థమైంది అందరూ చెప్పుకునే ఆ పరాశక్తివే నువ్వు నిన్ను హరించి నేనే త్రిలోకపాలకుడనవుతా నువ్వు మహామాయవైతే, నేను మాయలమారిని చూడవే నా రాక్షసమాయా ప్రభావం ' అని హుంకరిస్తూ తన రాక్షసవిద్యని ప్రదర్శించాడు

మరుక్షణం వాడు తాడిచెట్టంత నిలువున పదివేల చేతులతో పెరిగి తన పదివేల చేతుల్లోనూ వున్న శక్త్యాయుధాలను ఒక్కసారిగా దేవిపై ప్రయోగించాడు

ఆ పదివేల శక్త్యాయుధాలు చంద్రనిప్పులు చెరుగుతూ దేవివైపు దూసుకువెళ్లాయి అప్పుడు దేవి కాళికారూపాన్ని స్మరించి హస్తమునందు కొరివిని సృష్టించుకుని ఆ చండ ప్రచండ కొరివిని శక్త్యాయుధాల మీదకి ప్రయోగించింది

ఆ కొరివినుండి ప్రజ్వరిల్లిన భీకరాగ్నిజ్వాలకి పదివేల శక్త్యాయుధాలు ఒక్కసారిగా మాడి మసికాగా కొరివి దూసుకువచ్చి శుంభుని గుండెని ఢీకొట్టింది ఆ దెబ్బకి వాడు దభాలున నేలకూలి పదివేల చేతులూ మాడి మసికాగా నిజరూపం ధరించాడు

అప్పుడు శుంభుడు 'చివాలున లేచి 'ఓసీ కాలచక్రమునుబోలు యీ చక్రాయుధం నిన్నూ నీ సింహాన్నీ ఒక్క దెబ్బతో శిరస్సులు ఖండించి తీరుతుంది కాచుకో , ' అని గర్జిస్తూ చక్రాయుధాన్ని ప్రయోగించాడు ఆ చక్రాయుధం ప్రళయసదృశ శబ్దాలతో మెరుపులు మెరుస్తూ దేవి వైపు గిరగిర తిరుగుతూ దూసుకొచ్చింది

'ధూర్తుడా ఆయుధాలకే సృష్టికర్తని నన్నా యీ చక్రాయుధాలు సంహరించేది? త్రిలోకాలకూ, త్రినేత్రాలకూ, త్రిగుణాలకూ, త్రికాలాలకూ సంకేతమైన నా త్రిశూలం నీ చక్రాయుధాన్ని తుత్తునీయలు చేసి నీ గుండెలు చీల్చిపారేస్తుంది కాచుకో ' అంటూ దేవి ప్రళయభీకర గర్జనలు చేస్తూ త్రిశూలాన్నీ సృష్టించి చక్రాన్ని ఢీకొట్టి దాన్ని తుత్తునీయలు చేస్తూ అదే వేటుతో శుంభురుడి గుండెల్లో ఒక్కపోటు పొడిచి వాడి గుండెలు చీల్చివేసింది

'అమ్మా ' హృదయవిదారకంగా ఆక్రందించాడు శుంభుడు

'అమ్మనన్న జ్ఞానంలేక నన్ను కామించావు కనుక నిన్నిలా దండించాను చస్తూ, చస్తూ అమ్మా అని ఆక్రోశించావు గనక, అమ్మని కాబట్టి దయదల్చి నీకు సద్గతి ప్రసాదిస్తున్నాను త్రిలోకాలలో అమ్మని కామదృష్టితో చూసే వాడికెవడికైనా ఈ దుర్గతి తప్పదు.' అని హెచ్చరించింది అంబ శుంభుడు చేతుల జోడించి ఆ తల్లికి నమస్కరిస్తూ ప్రాణాలు వదిలాడు

దేవతలు పెద్దపెట్టున జయజయధ్వనులుచేశారు మహామాయమీద అఖండపుష్పవర్షం కురిపించారు దేవతలతోపాటు నారదుడు ఆ తల్లిని దర్శించుకుని నమస్కరిస్తూ 'అమ్మా దుష్ట రాక్షస సంహారం పూర్తయింది కనుక, ఇక నువ్వు శాంతించి, నీ ఉగ్రరూపాన్ని ఉపసంహరించుకుని, అమ్మలగన్న అమ్మగా, మా అమ్మగా, చదువుల అమ్మగా నీ ప్రశాంత, ప్రసన్న ధవళ స్వరూపంతో దర్శనమిచ్చి మమ్మల్ని తరింపజెయ్యి ' అని వేడుకున్నాడు



ఆ మరుక్షణమే దేవి కమలవాసినిగా, ధవళవస్త్రధారిణియై, వీణా పుస్తకపాణియై, వాణిగా ప్రసన్న వదనంతో ధవళకాంతులతో దర్శనమిచ్చింది

'మాయ అంటే అజ్ఞానం ఆ మాయ తెరతొలిగినప్పుడు పరిమళించేది జ్ఞానం అట్టి జ్ఞానాజ్ఞానాలు రెండూ నేనే ఎవరెవరి బుద్ధీ ఆలోచనలను బట్టి వారి వారిని ఆ విధంగా అనుగ్రహిస్తుంటాను ఈ సత్యాన్ని గ్రహించి అసుర భావాలకు మీ హృదయాల్లో చోటివ్వకుండా, సద్బుద్ధితో జ్ఞానవంతులై సుఖించండి, ఇదే నా సరస్వతీ అవతార రహస్యం ' అంటూ వారిని ఆశీర్వదించింది సరస్వతీదేవి

ఇలా జగన్మాత తన ఇచ్ఛాసంకల్పశక్తితో దుర్గా, సరస్వతులుగా అవతరించి ఆయా అవతారాల ప్రాశస్త్యాన్ని ముల్లోకాలకీ చాటింది ఇక సకల సంపత్ ఐశ్వర్య ప్రదాయిని అయిన శ్రీ మహాలక్ష్మీ అవతార విశేషాన్ని తెల్సుకుందాం

## శ్రీ మహాలక్ష్మీ అవతారం - మహిషాసుర సంహారం

బ్రహ్మవంశమునందు పుట్టిన కశ్యపప్రజాపతికి దితి, అధితి అనే ఇద్దరు భార్యలు వుండేవారు కశ్యపప్రజాపతి ముల్లోకాలనూ ధర్మనిరతితో పరిపాలిస్తుండేవాడు అతడికి చాలాకాలము వరకూ సంతానము కలగలేదు కశ్యపప్రజాపతి సంతాన నిమిత్తం యజ్ఞం చేశాడు ఆ యజ్ఞఫలంచేత అతడి పెద్ద భార్య దితి గర్భవతి అయింది

అందుచేత పెద్దభార్యకి పుట్టిన సంతానమే వంశానికి వారసులవుతారన్న ఈర్ష్యచేత అధితి తను కూడా సంతానవతి కావాలని వాంఛించింది ఆ విషయం భర్తకిచెప్పి ఒకనాటి సూర్యాస్తమయ అసురసంధ్యవేళ భర్తని కామమోహితుడిని చేసి, 'అది నిషిద్ధవేళ' అని భర్త వారించినా వినక అతడితో రతి సంయోగము చేసింది తత్ఫలితంగా అదితి కూడా గర్భవతి అయింది

అలా కొంతకాలం గడిచాక దితి, అధితి ఒకేసారి ప్రసవించారు దితి గర్భాన జన్మించిన వారు యజ్ఞఫలంచేత దేవతా స్వరూపాలతో మెరిసిపోవడంచేత వారు దేవతలుగా పిలవబడ్డారు ఇక అదితి అసురసంధ్యవేళ భర్తతో సంపర్కము పెట్టుకుని గర్భవతి అవడంచేత ఆమెకి పుట్టినవారు నల్లని దేహాలతో అసుర స్వభావం గలవారయ్యారు వారిని దైత్యులు అనీ, అసురులని పిలవబడ్డారు

దేవతలూ, అసురులూ పుట్టినప్పటినించీ దాయాదుల తగాదాలతో మదమాత్సర్యాలతో చీటికీ మాటికీ గొడవలు పడుతుండేవారు కశ్యపప్రజాపతి తన కుమారులమధ్యనున్న వైరాన్ని వారించడానికి దేవతలకి స్వర్గాధిలోకాలతో కూడిన 'నభోలోకాన్ని' దైత్యులకు యక్ష, కిన్నెర, గంధర్వ, కింపురుషాది లోకాలతోకూడిన పాతాళలోకాన్ని పంచి పరిపాలించుకోమని పంపి తాను చాలాకాలం భూలోకాన్ని పాలించి అనంతరం భార్యలతోసహా అరణ్యాలకి వెళ్లి వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించాడు భూలోకానికి మనువు వారసుడూ పాలకుడూ అయ్యాడు

అయితే పుట్టుకతో వచ్చిన దాయాదివైరం దేవదానవుల మధ్య అంతకంతకీ పెరుగుతూ వారి మధ్య ఎన్నో యుద్ధాలుకూడా జరిగాయి దేహ దారుఢ్యంలో మహాబలవంతులైన దానవులతో పోరులో నిలవలేక అసురులు విష్ణుమూర్తిని సహాయం అర్థించగా ఆయన అమృతాన్ని



సాధించమని ఉపాయంచెప్పి క్షీరసాగరమధనం జరిగినప్పుడు తాను కూర్మావతారాన్ని ధరించి మంధరపర్వతాన్ని వీపునమోసి అమరులకి సాయపడ్డాడు అమృతాన్ని దేవతలకి మాత్రమే పంచడానికి తాను జగన్మోహినీ అవతారాన్ని కూడా ధరించాడు అలా లభించిన అమృతపానంచేత అమరులు అమిత శక్తివంతులూ మృత్యువులేని చిరంజీవులూ అయ్యారు

అప్పటినుంచీ దానవులు తమ వైరభావాన్ని మరింత పెంచుకుని దేవతలమీద పగ ద్వేష ప్రతీకారాలతో దండయాత్రలు తరుచూ చేస్తుండేవారు అమృతంలో తమకి వాటా లభించకుండా విష్ణుమూర్తి కపట నాటకమాడాడన్న కక్షతో దానవులు ఆనాటినించీ విష్ణ ద్వేషులయ్యారు

అలా దైత్యవంశక్రమంలో రంభాసురుడు జన్మించాడు ఒకసారి జరిగిన దేవదానవ యుద్ధంలో రంభాసురుడి కుమారులందరూ మరణించారు తన వంశానికి వారసులులేరన్న దిగులు చెందిన రంభాసురుడు సంతానంకోసం బ్రహ్మగురించి ఘోరతపస్సు చేశాడు అతడి తపోప్రభావానికి ముల్లోకాలూ వణికిపోయాయి అప్పుడు ఆతడి తపోదీక్షకి మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు

'దేవా అమరులను నిర్జించగల అమిత బలపరాక్రమవంతుడూ, మరణంలేనివాడూ అయినటువంటి కుమారుడు నాకు కలిగేలా వరాన్ని అనుగ్రహించు ' అని కోరాడు రంభాసురుడు

బ్రహ్మ నవ్వి 'పుట్టిన ప్రతి జీవికీ మృత్యువు అనివార్యం, అయినా నీ తపస్సుకి మెచ్చి నీకో వరాన్ని అనుగ్రహిస్తున్నాను నీకు పుట్టబోయే కుమారుడిని ముల్లోకాలలోని దేవతలు గానీ, మానవులుగానీ ఎదిరించి నిలవలేరు ఆ కుమారుడిపై శస్త్రాస్త్రాలను ఎవరు ప్రయోగించినా వాటి వల్ల నీకుమారుని శరీరంనుండి చిందే ఒకొక్క రక్తపు చుక్కనుండి వేలాది ప్రతిరూపులు జన్మిస్తారు అంతమందినీ సంహరించి నీకుమారుని శరీరాన్నుండి రక్తము నేలపై చిందకుండా చేసినప్పుడుగానీ ఆతనికి మరణం సంభవించదు ' అని చెప్పాడు లోకంలో ఎవరినైనా రక్తం కారకుండా గాయపర్చి హతమార్చడం సాధ్యం కాదు కనక రంభాసురుడు 'సరే'నన్నాడు

'అయితే ఒక హెచ్చరిక ఈనాటి సూర్యాస్తమయం సమయంలోపునే నువ్వు నీ భార్యతో సంపర్కంచెంది నీ వీర్యాన్ని ఆమె గర్భంలో ప్రవేశపెట్టాలి అప్పుడే నువ్వు కోరుకున్న పుత్రుడు జన్మిస్తాడు లేదా నీకిచ్చిన వరం నిష్ప్రయోజనమైపోతుంది ' అనిచెప్పి బ్రహ్మ అంతర్ధానమయ్యాడు

రంభాసురుడు సంతానాపేక్షతో వడివడిగా తన రాజ్యానికి బయల్దేరాడు అయితే అతడు ఎంతవేగంగా ప్రయాణం చేసినా ఆ సాయంకాలానికి తన రాజ్యపొలిమేరలని కూడా సమీపించ లేకపోయాడు అటుచూస్తే అసురసంధ్యవేళ తరుముకొస్తోంది బ్రహ్మ ప్రసాదించిన వరం ఉపయోగం లేకుండా పోయేలావుంది ఏం చేయ్యాలా? అని దిగులుపడుతున్న రంభాసురునికి ఆ మార్గసమీపంలో పచ్చికమేస్తున్న ఒక 'మహిషి'(గేదె) కనిపించింది బ్రహ్మవరాన్ని ఎలాగైనా సాఫల్యం చేసుకోవాలన్న ఉద్దేశ్యంతో రంభాసురుడు విధిలేక ఆ అసురసంధ్యవేళ ఆ మహిషితో సంపర్కంచెంది తన వీర్యాన్ని మహిషి గర్భంలో ప్రవేశపెట్టాడు

బ్రహ్మ వరప్రభావంచేత ఆ మహిషి తక్షణం గర్భందాల్చి ఒక మగశిశువును ప్రసవించింది అతడే మహిషాసురుడు మహిషి గర్భాన్నించి జన్మించాడుకనుక అతడికి మహిషాసురుడని పేరు పెట్టుకుని వాడిని తన రాజ్యానికి తెచ్చుకున్నాడు రంభాసురుడు

బ్రహ్మవర ప్రభావంచేత పుట్టిన మహిషాసురుడు అమిత బలపరాక్రమవంతుడయ్యాడు ఇంద్రజాలాది రాక్షసవిద్యలతోపాటు మరెన్నో మంత్ర తంత్ర శస్త్రాస్త్ర విద్యలన్నింటిలోనూ విశేష ప్రజ్ఞావంతుడయ్యాడు నిరంతర రక్తపాన ప్రియుడై తన దేహరక్తాన్ని అమితంగా పెంచుకున్నాడు

రంభాసురుడి అనంతరం రాజ్యాధికారాన్ని చేపట్టిన మహిషాసురుడు పాతాళలోకంలోని ఇతర లోకాలైన గంధర్వ, యక్ష, కిన్నెర, సిద్ధ, సాధ్యాది లోకాలమీద దండెత్తి ఆ లోకాలన్నింటినీ జయించి సర్వసంపదలనూ హరించి తన రాజ్యానికి చేర్చుకున్నాడు అష్ట అయిశ్వర్యాలనూ కోల్పోయిన ఆయా లోకవాసులు బికారులై, నిర్భాగ్యులై ఆకలి దప్పులతో అలమటించిపోయారు దుర్భర దారిద్ర్యం ఆయాలోకాల్లో తాండవమాడింది

ఒక్కమాటలోచెప్పాలంటే అష్టఐశ్వర్యాలకూ నిలయమైన లక్ష్మీదేవి మహిషుని రాజ్యంలో కొలువు తీరినట్లయింది అలా సర్వసంపదలనూ చేకూర్చుకున్న మహిషుడు అమరుల రాజధాని అమరావతిమీద దండెత్తాడు

ఇంద్రాది దేవతలు మహిషునితో పోరుకు తలపడ్డారు వారు ప్రయోగిస్తున్న అనేక శస్త్రాస్త్రాలు మహిషుని శరీరాన్ని గాయపర్చి అతడి రక్తం నేల చింది, అలా చిందుతున్న ఒక్కొక్క రక్తపు బొట్టులోంచి వేలాదిమంది మహిషులు పుట్టి దేవతలను హింసించసాగారు దేవతల ఆక్రందనలతో, మహిషుల అట్టహాసాలతో దేవలోకం కంపించిపోయింది

ఇక ఇంద్రాదులు తాము మహిషసైన్యాన్ని ఎదిరించి నిలవలేమని నిశ్చయించుకుని, మహిషుల కళ్లుగప్పి పారిపోయి భూలోకంలో రహస్యంగా తలదాచుకున్నారు దేవతల సర్వ సంపదలకీ కారణమైన కామధేనువు, కల్పవృక్షం, ఇతరసంపదలు మహిషరాజ్యానికి తరలించబడ్డాయి

దేవలోకంలోని సంపదయావత్తూ కొల్లగొట్టబడటంచేత అమరావతి కాంతిహీనమై దారిద్ర్యం తాండవమాడింది అయితే దేవతలమీద మహిషునికి వున్న దాయాదివైరం తీరలేదు అతడు దేవతలమీద పగతీర్చుకోవడానికి వాళ్ల అనుపానులు తెల్సుకోడానికి గూఢచారులను నియోగించాడు

ఇలా జరుగుతుండగా ఒకసారి నారదుడు వైకుంఠానికి వెళ్లాడు అక్కడ శ్రీలక్ష్మీ శ్రీమన్నారాయుణులను అనేక విధాల స్తుతించి లక్ష్మీదేవివైపు తేరిపార చూస్తూ 'నీ ముఖంలో మునుపటి తేజస్సు కనిపించడం లేదేమిటమ్మా? సకల సంపదలకూ ఆలవాలమైన నీ లక్ష్మీకళ ఏమైంది?' అని అడిగాడు, ఏమీ తెలియనట్లు అమాయకత్వాన్ని నటిస్తూ, శ్రీలక్ష్మి మందహాసం చేసి 'యుగధర్మం మారుతోంది కదా, నారదా ఇప్పుడు ఎక్కడ బలం వుంటే అక్కడే సంపద వుంటుంది ఎవరు బలసంపన్నులైతే వారివద్దనే నా లక్ష్మీకళ నివాసం చేస్తుంది అది నా సహజ ప్రవృత్తి ' అని చెప్పింది

'అయితే, అసురులూ, అప్రాచ్యులవద్దకూడా నువ్వు కొలువుతీరతావా? వారు నీ సంపత్ సౌభాగ్యాలను దుర్వినియోగం చేస్తుంటే చూస్తూ వూరుకుంటావా? అయోగ్యులకి అధికారం, సంపదలు లభిస్తుంటే, ఇక ధర్మాన్ని ఎవరు పాటిస్తారు? నువ్వు ధర్మ ప్రవర్తకులని సుఖ పెట్టడానికి అవతరించావా? అధర్మ ప్రవర్తునులను రంజింపజెయ్యడానికి అవతరించావా?' అని నిష్ఠూరాలాడాడు నారదుడు







'ధర్మా, ధర్మ విచక్షణాజ్ఞానాన్ని జీవులు పాటించాలి నారదా! అది వారి బాధ్యత నాకు లోకంలోని జీవులందరూ బిడ్డలే నేను తల్లిని తల్లిగా ఆదరించిన వాడినీ ప్రేమిస్తాను తల్లిగా గుర్తించకపోయినా ప్రేమిస్తాను మితిమీరితే లోక హితం కోరి బిడ్డనయినా దండిస్తాను ' అని చెప్పింది లక్ష్మి

అయితే, మహిషుని దండించడానికీ, అతడి పరమైన సకలసంపదనూ లోకపరం చెయ్యడానికీ, తరుణం ఇంకా రాలేదా, తల్లీ?' అని సూటిగా అడిగేశాడు నారదుడు

శ్రీ లక్ష్మీదేవి ఒకసారి శ్రీమన్నారాయణుడిని వీక్షించి, నారదునితో 'సర్వసంపదలూ సంపూర్ణంగా మహిషుని వశం కాలేదుకదా నారదా! భూలోకంలో సంపదలు వుండబట్టే దేవేంద్రాదులు అక్కడ తలదాచుకుంటున్నారు సంపద అస్థిరమైనది చలిత స్వభావంకలది అది సుస్థిరంగా ఒకరిచెంత చేరినప్పుడు, దాన్ని తిరిగి చలింప చెయ్యడానికి నేను కార్యదీక్ష వహిస్తాను అట్టి కార్యదీక్ష దక్షత నాకు కలగడానికి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నన్ను ప్రార్థించినప్పుడు కదా, ఆ తరుణం వచ్చేది?' అని ఉపదేశించింది

నారదుడు తలపంకించి చిరునవ్వుతో 'అర్థమైంది తల్లీ నీ నిజతత్త్వ స్వరూపం ఇప్పుడు నాకు బోధపడింది మీ ఇరువురి ఆశీర్వాద అనుగ్రహబలంతో నా కర్తవ్యాన్ని, నెరవేరుస్తాను శెలవు ' అని అక్కడినించి బయల్దేరాడు

నారదుడు సరాసరి మహిషాసుర రాజ్యానికి వెళ్లాడు మహిషుడిని కుశలప్రశ్నలతో పరామర్శించి 'ఆహాఁ వైభోగం అంటే నీదేనయ్యా, మహిషాసురా! అష్టఐశ్వర్యాలూ నీ రాజ్యంలో కొలువుతీరాయి కుబేరుడు కూడా యీనాడు కడుదీనుడై ఏ మారుమూలో తల దాచుకున్నాడు కదా?' అన్నాడు

మహిషుడు తృళ్లిపడి 'ఆఁ కుబేరుడు కనిపించాడా?'అని అడిగాడు ఆతృతగా

నారదుడు నిట్టూర్చి ఒక్క కుబేరుడేయేమిటి? ఇంద్రాది దేవతలంతా, నీ పరాక్రమధాటికి తాళలేక భూలోకానికి చేరి రహస్యంగా కాలక్షేపం చేస్తున్నారు అక్కడా వుండకపోదురు కానీ, వారు చీకూచింతా లేకుండా రోజులు గడపడానికి అనువుగా భూలోకం సకలసంపదలతో సుభిక్షంగా వుందికదా? అసలా మాటకొస్తే యుద్ధంచేసి లోకాలన్నీ జయించి నువ్వు కొల్లగొట్టిన సంపద ఒకెత్తూ, భూలోక సంపదంతా ఒకెత్తు ఈ పదునాల్గు భువనాల్లోనూ నిరాశ్రయులయిన వాళ్లందరికీ ఆశ్రయమిచ్చేదీ, ఆదరించేదీ, ఆ భూలోకమేగదా ' అనన్నాడు

అయితే, ఆ భూలోకాన్ని కూడా కొల్లగొట్టి, దేవతలను దిక్కులేనివాళ్లను చేస్తాను అలా దిక్కూమొక్కూలేక, వేరేదారీ తెన్నూ లేక బయటపడే దేవతలమీద పగతీర్చుకుంటాను అసురజాతి వైరాన్ని సాధిస్తాను ' అంటూ అప్పటికప్పుడే భూలోకంమీద దండయాత్ర ప్రకటించాడు మహిషుడు మహిషుడి సేన ఆగడాలకి భూలోకవాసులు తాళలేకపోయారు అసురులు దేవతల జాడకోసం వెతుకుతూ దేవాలయాలన్నింటినీ నాశనం చేశారు దేవతా మూర్తులను ధ్వంసం చేశారు దేవతారాధనలూ, పూజలూ నిషేధించి, అలాంటివి చేసేవారినందర్నీ హింసపెట్టి వధించారు యజ్ఞయాగాది వైదిక ధర్మక్రతువులు జరపకుండా అవరోధాలు కల్పించారు సాధుజనులను సంహరించారు దేవతల ఆచూకీ చెప్పమని బెదిరిస్తూ స్త్రీ బాల వృద్ధులను సైతం చిత్రహింసల పాలుచేశారు భూలోక సంపదనంతా కొల్లగొట్టి మహిషాసుర రాజ్యానికి తరలించారు



భూలోకంలోకూడా సంపద, సౌభాగ్యాలు అంతరించి దరిద్రం విలయతాండవం చెయ్యసాగింది అలాంటి దుర్భర పరిస్థితులను భరించలేక తపస్సిద్ధిపొందిన మునులూ, మహర్షులూ, దేవతలవెంట సత్యలోకానికి వెళ్లి ముల్లోకవాసులు పడుతున్న బాధలను బ్రహ్మదేవునికి మొరపెట్టుకున్నారు

బ్రహ్మవారి దీనాలాపనలకు చలించిపోయి, 'నేను సృష్టికర్తను మాత్రమే జీవుల వృదిక్షయాలు నాచేతుల్లో లేవు కనుక వృద్ధి,క్షయకారకులైన విష్ణు, మహేశ్వరులనే తరుణోపాయం చూపించమని వేడుకుందాం పదండి ' అంటూ వాళ్లందర్నీ వెంటబెట్టుకుని వైకుంఠానికి వెళ్లాడు

'నేను పోషణకర్తని మాత్రమే సమయ సందర్భానుసారం నేను కొందరు అసురులని సంహరించినా, అసలు సంహారకర్త సదాశివుడు కనుక మహిషాసుర సంహారానికి తరుణోపాయం చూపించమని ఆయన్నే అడుగుదాం ' అంటూ విష్ణుమూర్తి వారందరితో కల్సి కైలాసానికి బయల్దేరాడు

కైలాసంలో సదాశివుడు యోగతపస్సులో వున్నాడు అది గమనించి బ్రహ్మాది దేవతలంతా పరమేశ్వరుడిని అనేక విధాల ప్రార్థించారు వారి ప్రార్థనలు ఫలించి శివుడు తపస్సు చాలించి కళ్లు తెరిచి వారిని వీక్షించాడు

'పరమేశ్వరా ముల్లోకాలకూ ఆదిపురుషుడవూ, మూలపురుషుడవూ నీవే నీ సంకల్ప శక్తికి మించినదేదీ యీ సృష్టిలోనేలేదు మహిషాసురుని మదబలముచేత ముల్లోకాలూ కొల్లగొట్టబడినవి సర్వసంపదలూ వాడి పరము కాగా ముల్లోకవాసులు దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తూ దీనాతి దీనంగా విలపిస్తున్నారు కనీసం వారు తమ వేల్పులకు మొరబెట్టుకునే వీలుకూడా లేకుండా ఆ రాక్షసుడు సర్వదేవతా ఆలయాలనూ, దేవతా మూర్తులనూ ధ్వంసం చేయించాడు ఆ మహిషుడి జన్మరీత్యా వాడిని సంహరించడానికి మానవ, దానవ, దైవాతీతమైన మరొక మహత్తర మహిమాన్విత శక్తిరూపం అవతరించాల్సిన అవసరం వుంది అవతారులకే ఆది అవతారివైన నువ్వే తరుణోపాయం ఆలోచించి ముల్లోకాలనూ మహిషుని బారినుండి రక్షించక తప్పదు పాహిమాం, పరమేశ్వరా పాహి పాహి ' అంటూ దేవతలూ, మానవులూ అతి దీనంగా ప్రార్థించారు వారి దీనాలాపనలకు ద్రవించిపోయిన మహేశ్వరుని నేత్రాలు మహిషునిపై ఆగ్రహావేశాలతో ఎర్రబారాయి ఆయన వదనం రౌద్రపూరితమైంది

'అవును మహిషుని వధించడానికి ఆ మహాశక్తి ఆవిర్భావం తప్పదు సర్వ సంపదలకూ, సకలైశ్వర్యాలకూ ప్రదాత అయిన ఆ మహాలక్ష్మి, అసురుని పరమైన అఖండ సంపదని తిరిగి స్వీకరించడానికి తానే తానే మహిషాసుర మర్దనిగా అవతరించక తప్పదు ఆ శక్తి సకల దేవతా శక్తి చేరికతో మహాశక్తిగా అవతరించక తప్పదు ' అంటూ మహేశ్వరుడు రౌద్రపూరిత స్వరంతో ప్రకటిస్తూ బ్రహ్మ విష్ణా దిదేవతలనందర్నీ ఉగ్రపూరితులని గావించాడు

అప్పుడు మహేశ్వరుని దేహమునుండి ఒక దివ్యతేజస్సు ఆవిర్భవించింది విష్ణుమూర్తి దేహమునుండి కూడా ఒక దివ్య తేజస్సు ఆవిర్భవించింది విష్ణు మహేశ్వరులనుండి ఆవిర్భవించిన తేజస్సులు ఏకమైన ఏకైక తేజోస్వరూపమై దశదిశలా వ్యాపించింది



ఆ ఏకైక దివ్యతేజస్సును పరాశక్తిగా గుర్తించిన ఇంద్రాది దేవతలూ, మునులూ ఆమెని అనేక విధాల ధ్యాన స్తోత్రాలచేత ప్రార్థించారు అప్పుడా తేజస్సు తేజోరూపమైన దివ్య స్త్రీ స్వరూపంగా ఆవిర్భవించింది అప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులూ, ఇంద్రాది దేవతలూ తమ దివ్య శక్తులను ఆమెకి ప్రదానం చేస్తూ ఆమెకొక విశిష్ట ఆకృతిని కల్పించారు

ఆ విరాట్‌స్వరూపిణి ఆకృతి ఏ విధంగా ఏర్పడిందంటే శివుని తేజముచేత ముఖము, విష్ణు తేజముచేత హస్తములు, యముని తేజముచేత శిరోజములు, చంద్రుని తేజముచేత స్తనద్వయము, దేవేంద్రుని తేజముచేత నడుము వరుణతేజము చేత తొడలు పిక్కలు భూదేవి తేజముచేత పిరుదులు, బ్రహ్మదేవుని తేజముచేత పాదములు, సూర్య తేజముచేత కాలి వ్రేళ్లు, వసువుల తేజముచేత చేతుల వ్రేళ్లు, కుబేరుని తేజముచేత నాసిక, ప్రజాపతి తేజముచేత దంతములు, అగ్ని తేజముచేత త్రినేత్రములు, సంధ్యాదేవి తేజముచేత కనుబొమలు, వాయుదేవుని తేజముచేత చెవులు, ఇతరదేవత తేజములచేత మిగిలిన శరీరభాగము ఏర్పడి ఆమె పద్మవాసినియై అవతరించుటచేత ఆమె పరాశక్తి రూపమగు 'మహాలక్ష్మి'గా గ్రహించి దేవతలందరూ మహదానందంతో ఆమెని కీర్తించారు

అప్పుడు మహేశ్వరుడు దేవతలనుద్దేశించి 'ఈమె త్రిశక్తి స్వరూపమైన మహాలక్ష్మి ఈమెని మహాశక్తిగా, మహిషాసుర మర్దనిగా అవతరించమని ప్రార్థిస్తూ మన మన శక్తులనూ, ఆయుధాలనూ ధారాదత్తం చెయ్యాలి ఈ జగన్మాతని మహాశక్తిగా అవతరించమని ప్రార్థించండి ' అని చెప్పాడు అంతట బ్రహ్మాది దేవతలంతా శ్రీ మహాలక్ష్మిని ఇలా ప్రార్థించారు

**నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణు శివాత్మికామ్।**
**త్రికాలజ్ఞాన సంపన్నాం నమామి భువనేశ్వరీమ్॥**

ఆ ప్రార్థన స్తోత్ర గానాలతో సంతృప్తురాలైన దేవి వారికి అభయ ప్రదానంచేస్తూ విరాట్ స్వరూపాన్ని ధరించింది అప్పుడు పరమేశ్వరుడు 'దేవీ ఇదిగో త్రికాలారాధ్యమూ, త్రిలోక పూజ్యమూ, శత్రుభయంకరమైన నా త్రిశూలం ఈ ఆయుధాన్ని పరిగ్రహించు ' అంటూ తన త్రిశూలమును ధారాదత్తం చేశాడు ఆ త్రిశూలం ఫెళఫెళార్భాటాలతో ప్రళయ ప్రభంజనంలా నిప్పులు విరజిమ్ముతూ తళతళమెరుస్తూ వెళ్లి దేవి హస్తాన్ని అలంకరించి శాంతించింది

విష్ణువు తన చక్రమును ధారాదత్తంచేస్తూ 'దేవీ రాక్షస సంహారకారిణి, శత్రుదుర్భేద్యమైన యీ చక్రాయుధాన్ని స్వీకరించు ' అన్నాడు విష్ణుచక్రాయుధం కోటి సూర్య ప్రభాస కాంతులు విరజిమ్ముతూ గిరగిర తిరుగుతూ దూసుకువెళ్లి దేవిహస్తాన్ని అలంకరించి తన ప్రతాపాన్ని ఉపసంహరించుకుంది

అప్పుడు బ్రహ్మదేవుడు జ్ఞానస్వరూపమైన తన కమండలాన్ని ధారాదత్తం చేశాడు అంతట అగ్నిదేవుడు తన ప్రచండ దావాగ్నిశక్తిని, వరుణుడు శంఖము, పాశాలను, దేవేంద్రుడు వజ్రాయుధాన్ని, యముడు తన కాలదండమును, ప్రజాపతి అక్షమాలను, సూర్యుడు శిరోజాలతో పేనిన పగ్గమును, కాలుడు ఖడ్గ పలకములను, క్షీరసముద్రుడు దివ్య వస్త్రములు ముక్తాహారమును, చూడామణి, కుండలములు కంఠాభరణము, హస్త కంకణములను, భుజకీర్తులు, కంఠాభరణము తదితర ఆభరణాలనూ, విశ్వకర్మ చండప్రచండమైన గండ్రగొడ్డలిని, సముద్రుడు అభేధ్యమైన కవచమును, కమలమాలికనూ, హిమవంతుడు భయంకరాకృతిగల సింహవాహనమును, కుబేరుడు మద్యపాత్రను, ఆదిశేషుడు నాగమణిహారమును, ఇతరదేవతలు తమ తమ శక్తి





ఆయుధాలనూ దేవికి సమర్పించారు ఆ ఆయుధశక్తితో బలసంపన్నురాలైన దేవి ప్రచండ భీకర రూపిణియై వీరావేశంతో ఊగిపోతూ భీకర భయంకర అట్టహాసాలుచేసింది

ఆమెయే మహాశక్తి ఆవిడే ఆది పరాశక్తి అదే మహిషాసురమర్దని, వీర ఉన్మత్త ఉగ్రభగ్ర స్వరూపం ఆ దేవి కనులవెంట నిప్పులు రాలుస్తూ 'రేయ్ రేయ్ ఊం ఊం అని ఊగిపోతూ దోషానల జ్వాలలు వదులుచుంటే ఆ ప్రచండ శక్తిరూప పదఘట్టనలకి ముల్లోకాలూ దద్దరిల్లిపోయాయి భూమి విలవిల కంపించసాగింది సముద్రాలు నిలువెత్తున ఉప్పొంగ సాగాయి పెనుతుఫానులను మించిన ఆమె నాసికా వాయు ప్రభంజనాల ఘోషకి వాయుదేవుడే గజగజ వణికిపోయాడు

ఆ ఆదిశక్తి భీకరరూపానికి భయభ్రాంతులైన ముల్లోకవాసులూ భీతితో ఆమెను స్తుతిస్తూనే 'జయహో జగన్మాతా జయ జయ జయహో మహాశక్తీ జయ జయ , ' అంటూ జేజేలు పలకసాగారు అమరులు మరికొందరు ఆమెచేతనున్న సురాపాత్రలోకి అంతరిక్షంనుండి మధువు నింపసాగారు

ఆ మహాశక్తి ఆ జేజేలకి ఉన్మత్తురాలవుతూ, సురాపానం చేస్తూ ఆ మద్యపాన ఆవేశంతో ఊగిపోతూ 'ఏమీ ఏమి ఏం కావాలి ?' అని గర్జించింది

'సంహారం మహిషాసుర సంహారం ' యావన్మందీ పెద్దపెట్టున ఏకకంఠంతో నినదించారు ఆ తల్లి వారి అభ్యర్ధనలకు తలపంకిస్తూ ఉన్మత్త ఆవేశంతో ఊగిపోతూ 'అసురా మహిషాసురా ' అని గాండ్రించింది పదునాల్గు భువనాలూ దద్దరిల్లిపోయేలా

ఆ ప్రళయకాలగర్జన వినిపించి మహిషాసురుడు అదిరిపడ్డాడు అదే సమయంలో ముక్కోటి దేవతలూ ఆ మహాశక్తికి రణోత్సాహాన్ని రేకెత్తించడానికి దప్పులు, ఢమరుకాలూ , ఢంకాలూ ఢమఢమ వాయిస్తూ అనేకానేక శంఖారావాలూ ఊదుతూ యుద్ధవాతావరణాన్ని హోరెత్తించారు వారి ఢంకా ఢమరుక భేరీ నాదాల ప్రళయఘోష పాతాళలోకాన్ని దద్దరిల్ల జేసింది

'ఆఁయ్ మృత్యుంజయుడూ, శతృభయంకరుడైన యీ మహిషాసురుని మీద రణ నినాదాలు జరపగలవారు యీ ముల్లోకాల్లో వున్నారా? ఎవరు ? ఎవరిదా రణభేరి ?' అంటూ హుంకరించాడు మహిషాసురుడు అంతలో ఓ అసురుడు భయభ్రాంతులతో పరిగెత్తుకొచ్చి ఆయాసంతో రొప్పుతూ 'ప్రభూ అది ఆడదో ఆదిశక్తో ? ఆ మహాశక్తి ప్రళయ భీకరస్వరూపంతో ఆవేశకావేశ ఉన్మత్తగర్జనలతో మన లోకంవైపే కదలివస్తోంది ఆమె అధివశించిన సింహరాజం తన భీకర గాండ్రింపులతో మరింత భీతి గొలుపుతోంది దేవతలంతా భేరీ నినాద ఢంకా ఢమరుక శంఖారావాలతో ఆ శక్తిని రెచ్చగొడుతున్నారు ప్రళయమే మనవైపు కదిలి విరుచుకు పడబోతున్నట్లుంది ప్రభూ అని విన్నవించాడు భయంతో వణికిపోతూ

'ప్రళయమా ? ప్రభంజనమా ?' అంటూ మహిషుడు దిగ్గునలేచి 'చామరాసురా కరాళాసురా ఉదగ్రాసురా చిక్షురా తామ్రా దుర్ముఖా అసుర వీరులారా మీరంతా మీ మీ సేనావాహినులతో రణోత్సాహులుకండి సకలశస్త్రాస్త్ర మారణాయుధాలనూ ధరించి రణభూమికి కదలండి మీ మీ మాయా రాక్షసవిద్యా ప్రదర్శనలతో అట్టహాస ఘోషలతో ఆ మహాశక్తిని, ఆమె వెన్నంటి వస్తున్న దేవతాసేనా సమూహాన్ని నిలువరించి నిర్జించండి శతృమూకలను చీల్చి చెండాడండి ' అని ఆజ్ఞాపించాడు భీకరస్వరంతో

'జయహో మహిషాసురా జయహో ' పెద్దపెట్టున నినాదాలుచేస్తూ అసురసేనలు సముద్రఘోషలా గాండ్రింపులు చేస్తూ యుద్ధభూమికి బయల్దేరాయి అసుర సైనికుల ఆర్భాటాలతో అంతరిక్షమందంతటా ధూళిసుడులు తిరుగుతూ కమ్ముకుపోసాగింది ఆ ధూళిసుడులను చూస్తూ, ఆ దుమ్ముపొరల వెనుకనున్న రాక్షససేనావాహిని కనిపించకపోవడం చేత దేవతలంతా బెంబేలెత్తిపోయారు అప్పుడు అమ్మవారు ఒక్కసారిగా తన నాసికాపుటలను అనంతంగాపెంచి ఆ ధూళిసుడులను ఒక్కఉదుట్న పీల్చివేసింది

అప్పుడు అప్పుడు తమ కళ్లముందు కనిపించిన అమ్మవారి ఉగ్రస్వరూపాన్ని చూస్తూ రాక్షస సమూహం యావత్తూ నిశ్చేష్టులైపోయారు

'సంహార సంహార అసుర సంహార ' గర్జిస్తూ ఊగిపోసాగింది అమ్మవారు ఆమె దశ బాహువులనూ అలంకరించివున్న త్రిశూల, చక్ర, శంఖ, గద, ఖడ్గ, పరశు, పాశాది దివ్యాయుధాలు ధగధగమెరుస్తూ రాక్షససేనలను భయకంపితుల్నిగావించాయి

'ఈ ఆదిశక్తి మామూలు శక్తి కాదు ప్రభూ రాక్షసకులాన్ని నాశం చెయ్యడానికి అవతరించిన మహమ్మారిలా వుంది ప్రభూ ' అంటూ రాక్షసులు భయంతో గగ్గోలుపెట్టారు

'ఆదిశక్తి అయినా ఆడదేకదా ఒక్కపెట్టున ఆ శక్తిమీదకి లంఘించండి ఆమె హస్తాలు తెగనరకండి ఆ సింహాన్ని సంహరించండి ' అని ఆజ్ఞాపించాడు చామరాసురుడు భీకర స్వరంతో

మరుక్షణం రాక్షసులు 'జయహో మహిషాసురా ' అంటూ పెద్దపెట్టున నినాదాలుచేస్తూ మహాశక్తిమీదకి లంఘించి ఖడ్గాలూ, బాణాలు, గదలూ పెద్దపెట్టున ప్రయోగించారు

అమ్మవారు ఒక్కసారిగా 'హూఁ ' అంటూ హూంకారం చేసింది ఆ హూంకార జ్వాలకి ఆయుధాలన్నీ రెప్పపాట్లో భగ్గునమండి బూడిదైపోయాయి

అంతట అమ్మవారు మరోసారి హూంకారంచేస్తూ తన రెండు చేతులకీ వున్న పదివేళ గోళ్లనూ ఒక్కసారి విదిలించింది ఆ గోళ్ల విదిలింపులోనుండి వెలువడిన శక్తులను చూసి బ్రహ్మ విస్మయుడవుతూ 'కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాంకృతిః' అని కీర్తించాడు అంటే శ్రీమన్నారాయణుడి దశావతారములు ఎంతటివో అంతటి శక్తి సంపన్నములు ఆ పదిగోళ్లనుండి క్షణంలో ఉద్భవించిన దశశక్తులు అని అర్థం ఆ దశశక్తుల ప్రచండప్రతాపానికి అమ్మవారి మీదకి ఉరకబోయిన రాక్షససేన యావత్తూ క్షణంలో బూడిదైపోయింది

అప్పుడు రాక్షససేనానాయకులు అమ్మవారిమీదకి యుద్ధానికిరాగా ఆమెనుండి నవదుర్గలు అవతరించి వారిని ఎదుర్కొన్నారు ఆ భీకరయుద్ధములో దేవతలూకూడా రాక్షసులను ఎదుర్కొన్నారు అమ్మవారి వాహనమైన సింహరాజం భీకరంగా ఘర్జిస్తూ దొరికిన రాక్షసులను దొరికినట్లు గొంతులు కొరికి, గుండెలుచీల్చి సంహరించసాగింది

అప్పుడు రాక్షస సేనానాయకులు తమ ఆయుధాలు అమ్మవారిమీద ప్రయోగించ సాగారు అంతట అమ్మవారు 'రేయ్ ' అని గర్జిస్తూ చిక్షురుడు, చామరుడు తదితర రాక్షసులను త్రిశూలంతో గుండెలుచీల్చివేస్తూ, గదతో నుగ్గునుగ్గుచేస్తూ, గండ్రగొడ్డలితో తలలు నరుకుతూ సంహరించి వేసింది

'జయహో మాతా  జయహో ' అమరుల జయజయధ్వానాలు వింటూ మహిషుడు స్వయంగా యుద్ధభూమికి కదలివచ్చాడు  అతడు వస్తూనే తన సహజ జన్మ కారకమైన మహిషరూపం ధరించి ముక్కులనుండి పొగలుచిమ్ముతూ తన కాలిడెక్కలతో దేవతలను తొక్కిపారేస్తూ, కొమ్ములతో వాళ్లని కుమ్మిపొడిచి పారేస్తూ, తోకతో వాళ్లని ఛెళ్లు ఛెళ్లున బాదుతూ, నోటితో వాళ్లను కరచి కొరికి గాయపర్చి బాధించసాగాడు

దేవతలూ ఆ బాధలు భరించలేక 'పాహిమాం  మాతా  పాహిమాం ' అంటూ ఆక్రందనలు చేశారు  అప్పుడు అమ్మవారు రౌద్రాకారంతో గర్జిస్తూ ఆ మహిషాన్ని బంధించడానికి పాశమును దాని కొమ్ములమీదకి విసిరింది

మరుక్షణం మహిషుడు సింహరూపం దాల్చాడు  అమ్మవారు ఉగ్రురాలై ఆ సింహముమీదకి బాణాలు శరపరంపరగా కురిపించింది

అప్పుడు మహిషుడు గజరూపందాల్చి తన తొండముతో అమ్మవారిని చుట్టి విసిరికొట్టబోగా అమ్మవారు గండ్రగొడ్డలితో ఆ తొండమును నరికివేసింది

అప్పుడు మహిషాసురుడు 'శిరస్సుతప్ప మిగతా దేహమంతా మహిషదేహము'గా తన నిజ స్వరూపమును దాల్చి భీకరంగా గర్జించాడు  కాలిగిట్టలతో రణభూమిని గీరగా ధూళిసుడులు తిరుగుతూ మేఘాల మాదిరి అంతరిక్షమును చుట్టుముట్టింది

'మహిషా  మూర్ఖా ' ఘర్జించింది అమ్మవారు, తనచేతనున్న సురాపానపాత్రలోవున్న మద్యాన్ని ఒక్కగుటకలో త్రాగేసి ఆవేశంతో ఊగిపోతూ 'అసురా  మూడిందిరా నీ ఆయువు ' అంటూ ఘర్జించింది

అప్పుడు మహిషుడు తన ఆకారాన్ని నిలువెత్తున పెంచుకుంటూ పర్వతాలను పెకలించి అమ్మవారిమీదకి విసరగా ఆమె ధనుర్బాణాలతో వాటిని తుత్తినియలు చేసింది

మహిషుడు మద్యపానముచేస్తూ ఆవేశంతో పేట్రేగిపోతూ 'మహామారీ  యీ మహిషాసురుని మీదన నీ ప్రతాపం? చూడు నిన్నేం చేస్తానో ' అంటూ రంకెలువేస్తూ ముందుకు ఉరకబోగా అమ్మవారు గదాదండంతో ఒక్కమోదుమోదింది  ఆ దెబ్బకి రక్కసుడి శరీరం చిట్లి రక్తపుచుక్కలు నేలకారి ఒక్కొక్కరక్తపు చుక్కనించి ఒక్కొక్క మహిషుడు పుట్టుకొచ్చి వికటాట్టహాసాలు చేశారు

అమ్మవారు పెద్దగా హుంకరిస్తూ కాళికలామారి తన నాలికను పొడుగ్గా చాచసాగింది రక్తపానంతో ఎరుపెక్కిన ఆ నాలిక విశ్వమంతటా వ్యాపిస్తూ ఎక్కడా నేలకనిపించక ఎర్రటి తివాచీ పరచినట్లు కనిపించింది  అంతట అమ్మవారు చక్రాయుధ ప్రయోగంతో మహిషులందర్నీ ఒక్కవేటుతో సంహరించి వారినుంచి కారుతున్న రక్తాన్నంతటినీ నాలికతో పీల్చివేసింది

అప్పుడు మహిషాసురుడు రెచ్చిపోతూ 'మాయావినీ  చూడు నిన్నేం చేస్తానో ' అంటూ ఖడ్గాన్నిదూసి ఆమెమీదకి లంఘించబోయాడు

'మూఢా  మహిషాసురా  సర్వజగద్రక్షకినైన నా ముందా నీ ప్రగల్భాలు  చూడరా నీకేగతి పట్టనుందో ' అని గర్జిస్తూ ఎడమపాదాన్ని విసురుగాలేపి మహిషుని తన నాలికపైన పడేసి కాలితో కదలకుండా అణగద్రొక్కి త్రిశూలముతో వాడి గుండెలో ఒక్కపోటు పొడిచింది

మహిషి శరీరాన్నుండి ఉవ్వెత్తున ఎగసిన రక్త ధారలను అమ్మవారు తన నాలికతో పీల్చి వేస్తుండగా వాడు ఆమెపాదం క్రింద గిలగిలలాడుతూ, తన ఆయుధంతో పోరాడసాగాడు

అంతట అమ్మవారు 'మహిషా ఇక నీ ఆయువు మూడిందిరా ' అని గర్జిస్తూ ఒకచేత వాడి శిరోజాలుపట్టి, మరోచేత ఖడ్గంతో వాడి తల నరికి పారేసింది అమ్మవారి చేతనున్న వాడి ఖండిత శిరస్సునుండి కారుతున్న రక్త ధారలని ఆమె మరోచేత పళ్లెంలోనింపి ఆ రక్తాన్ని యావత్తూ త్రాగేసింది అంతటితో మహిషాసురుడు మరణించి విగతజీవుడయ్యాడు

'జయహో మాతా మహిషాసురమర్దనీ జయహో ' అంటూ బ్రహ్మాదిదేవతలంతా బ్రహ్మానందంతో జయజయధ్వానాలు చేశారు దేవతలు అంతరిక్షం నుండి అమ్మవారిపై పుష్పవర్షం కురిపించారు గంధర్వులు జయగీతికలు ఆలపించారు

'మహామాయే మహాలక్ష్మీ మహిషాసురసంహారిణీ నవదుర్గే నారాయణీ బ్రహ్మవిష్ణు శివాత్మికే మహాబాహే మహాకాళీ నమామి భువనేశ్వరీమ్ ' అంటూ ముల్లోక వాసులూ స్తోత్రగానాలతో అమ్మను స్తుతించి, ఆమెను శాంతింపజేశారు

అప్పుడు ఇంద్రాదిదేవతలు అమ్మా జగదోద్ధారిణీ మహిషాసుర సంహారంతో సర్వ సంపదలూ సమస్తలోకాలనూ చేరి మహాలక్ష్మియను నీ అవతారనామం తిరిగి లోక ప్రసిద్ధమైంది అలాగే, దుష్టశిక్షణార్థం, శిష్టరక్షణార్థం, నీవు మహిషాసురమర్దనిగా, దుర్గగా యీ జగత్తున అవతరించమని ప్రార్థిస్తున్నాం భక్తాభీష్ట వరప్రదాయినిగా, కామేశ్వరిగా, అపరాజితగా నీవు శాశ్వితంగా నివశించవల్సిన తరుణం ఇదే మా కోర్కెను మన్నించు ' అని ప్రార్థించారు

'అవతారములకే అవతారిణిని జగాలన్నింటినీ నా కుక్షిలో వుంచుకున్న జగన్మాతని నేను నివశించగల చోటూ నన్ను భరించగల శక్తీ ఎవరికుంది? ఎక్కడుంది?' అని అడిగింది అమ్మవారు

'చోటులేకేం తల్లీ యుగారంభమున ఇంద్రకీలుడు అను యక్షుడికి నువ్వు ఓ వరాన్ని అనుగ్రహించావు కదా ఇప్పుడా వరాన్ని ఆచరించి ముల్లోకవాసులనూ నీ కరుణా కటాక్ష వీక్షణాలతో అనుగ్రహించు మాతా ' అని ప్రార్థించాడు బ్రహ్మ

# ఇంద్రకీలుడి గాథ

ఇంద్రకీలుడు అనే యక్షుడు ఒకసారి జగన్మాతదర్శన అనుగ్రహాలకోసం తపస్సు చేశాడు అతడు యక్షలోకంలో నిత్యం లభించే సుఖభోగాలన్నీ త్యజించి, కేవలం, పారమార్థిక చింతనతో తపస్సు ఆరంభించాడు ఆతడి తపస్సు భక్తిప్రపత్తులతో నిర్విరామంగా జరిగింది

ఇంద్రకీలుడి తపశ్శక్తికి త్రిజగాలూ కంపించిపోయాయి దేవతలూ, మహర్షులూ ఆతని తపశ్శక్తికి భయపడిపోయి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను శరణువేడారు పరమేశ్వరుడు వారికి అభయ ప్రదానంచేస్తూ 'భయపడకండి ఇంద్రకీలు తపస్సు పారమార్థికమైంది అతడి తపస్సువల్ల ముల్లోకాలకూ మేలు జరుగుతుంది ' అని తెలియజేశాడు

అప్పుడు దేవతలూ, మహర్షులూకూడా ఇంద్రకీలుడి తపస్సు త్వరగా ఫలించి త్రిజగాలకూ ఊరట కలగాలనే సంకల్పంతో తామూ జగన్మాతని ప్రార్థించారు ఇందరి ప్రార్థనల ఫలితంగా అమ్మవారు ఇంద్రకీలుడి ముందు ప్రత్యక్షమై తన దర్శనభాగ్యంతో అతడిని తరింపజేసింది






'నాయనా  అందరూ ఇహలోక సుఖాలను ఆశించి నన్ను ప్రార్థిస్తారు నీ తపోదీక్షకు మెచ్చాను నీకేం కావాలి? అష్టఐశ్వర్యాలు ప్రసాదించమంటావా? భోగభాగ్యాలు కావాలా? స్వర్గ లోకానికిగానీ ప్రభువునుచెయ్యనా? ఏమిటి నీ కోరిక?'' అని అడిగింది మందస్మిత ప్రసన్న వదనంతో జగన్మాత

ఇంద్రకీలుడు మరొక్కసారి భక్తితో ఆమెకి ప్రణమిల్లి 'మాతా  నీకు సర్వమూ తెలుసు సర్వజగాలనూ బ్రోచికాచెడి అమ్మకి తనబిడ్డడి మనోరథం తెలియదా? అయినా అమ్మగా నువ్వు అడిగావు గనక, బిడ్డడిగా చెప్పడం నా విధి  అడగనా?'' అన్నాడు సంశయరహితంగా

'అడుగు నాయనా  అడగందే అమ్మయినా పెట్టదనే సామెత నీకూ తెల్సుగదా? అడుగు ' అంది జగన్మాత

ఇంద్రకీలుడు మరింత వినయవిధేయతలతో మరోసారి మాతకి నమస్కరించి 'అమ్మా నాకు ఇహ, పర సుఖాలపైగానీ, అశాశ్వితమైన భోగభాగ్యాలమీదగానీ ఆశ లేదు  తల్లీ నీవు నన్ను అనుగ్రహించి దయతో నా ఉదరస్థానమందు శాశ్వితంగా నివశించు  నన్ను కృతార్థుడినీ, చరితార్థుడినీచెయ్యి  నా యీ జన్మకి పవిత్ర పారమార్థాన్ని అనుగ్రహించు ' అని ప్రార్థించాడు

ఇంద్రకీలుడి కోర్కెవిని మిక్కిలిసంతోషించిన మాత 'నాయనా  ఇంద్రకీలా పవిత్రభావంతో నిండిన నీ కోర్కెలో దోషంలేదుగానీ  ముల్లోకాలనూ నా గర్భంలో నిలుపుకున్న జగన్మాతని నేను  త్రిజగత్కారిణినైన నేను పరుల గర్భమందు నివసించడం అసాధ్యం, అసంభవం అదీగాక బిడ్డలు తల్లి గర్భమందు పెరగడం ధర్మంగానీ, తల్లి బిడ్డడి గర్భమందు వశించడం లోకవిరుద్ధం, ప్రకృతి ధర్మవిరుద్ధం కనుక నీకు ఉచితమైనది మరేదైనా కోరుకో తీరుస్తాను ' అని పలికింది

ఇంద్రకీలుడు భక్తితో చేతులు జోడించి 'అమ్మా  సాక్షాత్తూ జగన్మాతవైన నీదర్శనభాగ్యం లభించాక కూడా ఇహపర సుఖాలకై తపించేవాడు పరమమూర్ఖుడు  నువ్వు నా గర్భస్థురాలివై నివశించాలన్న పవిత్రకాంక్షతప్ప నాకు మరెట్టి కోరికాలేదు రాదు  ఆపైన నీ దయ  ' అని విన్నవించాడు

జగన్మాత మందహాసంచేసి 'నీ కోరిక అసాధ్యమైనదైనా నీభక్తి పరమార్థం నన్ను సంతుష్టురాలిని చేసింది నాయనా  నీ కోరిక తీరుస్తాను  అయితే ఇప్పుడు కాదు నీవు పర్వత రూపందాల్చి ఇంద్రకీల పర్వతమనే పేరుతో ప్రసిద్ధుడవుతావు కాలక్రమాన మహిషాసుర సంహారానంతరం త్రిలోకవాసుల ప్రార్థనమేరకు నేను మహిషాసురమర్ధనిగా నీ గర్భమందు వశిస్తాను  కలియుగాంతం వరకూ నేను నీ పర్వత గర్భ నివాశినియై వశించి, దుర్గమమైన నీ పర్వత గర్భమునుండి ఆవిర్భవించిన దానినవడంచేత దుర్గగా పిలవబడతాను నన్ను దర్శించిన ప్రతివారూ ముందు నిన్ను తల్చుకుని నీ నామాన్ని స్మరిస్తారు ముక్కోటిదేవతలూ, మానవులూ నన్ను దర్శించి పూజించేందుకుగాను ముందుగా నిన్ను దర్శించి, స్పర్శించి నిన్ను కీర్తిస్తారు ఇంకా అనేకవిధాలుగా నీ నామం చరితార్థమవుతుంది ' అని ఆశీర్వదించింది జగన్మాత



మాత ప్రసాదించిన వరమునకు ఇంద్రకీలుడు పరవశించిపోతూ 'ధన్యోస్మి మాతా ధన్యోస్మి ఈ దీనుడిని కనికరించావు నీ పాద స్పర్శకోసం, నీ అనుగ్రహంకోసం ఎంతకాలమైనా నిరీక్షిస్తాను ' అని ప్రార్థిస్తూ ఆ తల్లి పాదాలముందు మోకరిల్లి అప్పటికప్పుడే పర్వతరూపుడిగా మారిపోయాడు ఇంద్రకీలుడు

బ్రహ్మదేవుడు యీ గాధను గుర్తుచేసి 'లోకపావనీ భూలోకంలో పర్వతరూపుడైన ఇంద్రకీలుడు నీ అనుగ్రహం కోసం నిరీక్షిస్తున్నాడు కావున నీవు యీ మహిషాసురమర్దని రూపంలో అక్కడ అవతరించి ఆతడినీ, మమ్మల్నీ తరింపజెయ్యి ' అని ప్రార్థించాడు అమ్మవారు అభయహస్తంతో కటాక్షిస్తూ 'తథాస్తు ' అంది

మరుక్షణం భూలోకములో భరతఖండములో కృష్ణానదీ తీరప్రాంతంలో పర్వతాకారుడై వున్న ఇంద్రకీలుడి గర్భంనుండి వారుణీశక్తిగా ఆవిర్భవించింది మహిషాసుర మర్దని

ఆ ఉగ్రస్వరూపిణి దక్షిణనేత్రం అగ్నినేత్రం ఆమె వామనేత్రం ప్రశాంతకరుణా నేత్రం దుర్గమమైన ఇంద్రకీలాద్రి పర్వత గర్భంనుండి ఆవిర్భవించిన ఆ దుర్గమ్మ దక్షిణనేత్ర దృష్టి సోకి ఆ ప్రాంతానవున్న పర్వతకుడిభాగం అగ్నివిస్ఫోటనాలతో బ్రద్దలై పొగలు కక్కుతూ, నిప్పులు చిమ్ముతూ అంతరిక్షానికెగిసింది

ఆ పర్వతభాగంవల్ల ఎవరికీ ఎట్టి కీడూ జరక్కుండా నిరోధించడానికి ఆ తల్లి నవదుర్గా వతారాల్లో ఒకరైన 'మంగళగౌరి' తన పాదస్పర్శతో దాన్ని నిలువరించి భూమిపై నిలిపింది మంగళగౌరి పాదస్పర్శతో నిలిచిన ఆ పర్వతభాగమే నేటి 'మంగళగిరి' పర్వతం

ఆ పర్వతంలోని అగ్నిజ్వాలలను అదుపుచేయడానికి అవతరించినదే 'జ్వాలానృసింహ' ఆవిర్భావం ఆ జ్వాలానృసింహుని అగ్నిదాహకాన్ని ఉపశమింప చెయ్యడానికే నేటికీ మంగళగిరి నృసింహస్వామికి బిందెలు బిందెలుగా బెల్లపు పానకాన్ని సమర్పిస్తుంటారు భక్తులు ఆయనే మంగళగిరి పానకాలస్వామి అని పిలుస్తుంటారు

అలా ఇంద్రకీలాద్రిపై మహిషాసురమర్దని రూపంలో అవతరించిన దుర్గాదేవి 'నేటినుండి కలియుగాంతం వరకూ నవదుర్గలతో యీ ప్రాంతాన్ని పాలిస్తూ నన్ను కొలిచిన వారికి కొంగు బంగారమవుతాను కాలక్రమంలో యీ ప్రాంతం లోకప్రసిద్ధం, చరిత్ర ప్రసిద్ధమవుతుంది విద్యలకూ, విజయాలకూ ఆలవాలమై విజయవాటికగా శోభిల్లుతుంది ముక్కోటి దేవతలూ, మానవులూ నన్ను దర్శించి, పూజించి తరిస్తారు ' అని అభయప్రదానం చేసింది ఆనాటినించీ ఈ నాటివరకూ అమ్మవారు ఇక్కడ పూజలందుకుంటూ సర్వాభీష్టాలనూ నెరవేరుస్తోంది

అప్పట్లో యీ ప్రాంతానికి 'విజయవాటిక' అన్న పేరులేదు ఆ పేరు ఎలా వచ్చిందో తెలిపే గాధ ఇక్కడ లభించిన శిలాశాసనాల ద్వారా యీ విధంగా తెలుస్తోంది





# విజయవాటిక చరిత్ర

ద్వాపరయుగంలో కౌరవులు పన్నిన కుతంత్రాల ప్రభావంగా జరిగిన మాయాజూదంలో పాండవులు ఓడిపోయారు జూద నియమాన్ననుసరించి పాండవులు పన్నెండేళ్లు అరణ్యవాసం అనంతరం ఒక ఏడాది అజ్ఞాతవాసం అనుభవించడానికి కట్టబట్టలతో అరణ్యాలకి వెళ్లారు ధర్మనిరతులైన పాండవులను అనవరతం కాపాడుతూ వారిని ధర్మమార్గాన నడిపించే శ్రీకృష్ణ పరమాత్మ ఒకసారివారి యోగక్షేమాలు విచారించడానికి అరణ్యంలోని వారి కుటీరానికి వచ్చాడు

ధర్మరాజు అతిధిపూజచేసి శ్రీకృష్ణుని సత్కరించి 'మహానుభావా నీ దయచేత యీ అరణ్యంలో కూడా మాకు ఏ లోటూ లేదు కానీ, నా తొందరపాటు, ద్యూత నియమం కారణంగా నా సోదరులనూ, ద్రౌపదినీ, మా అభిమాన జనాలని అరణ్యాల పాలుచేశానన్న ఆత్మక్షోభ నన్ను పట్టి కుదిపేస్తోంది నన్నుఎవరైనా జూదానికి ఆహ్వానిస్తే, ఆ ఆహ్వానాన్ని నిరాకరించకూడదన్న నా నియమంవల్ల గదా, ఇందరికీ ఇంతకష్టం సంభవించింది అని వాపోయాడు

శ్రీకృష్ణుడు ధర్మరాజుని ఊరడిస్తూ 'కనిపిస్తున్న కారణాలని బట్టి ఇన్ని అనర్ధాలకీ కారకుడివి నువ్వే అనిపిస్తున్నప్పటికీ, అసలు కారణం విధి ఆ విధి ప్రభావాన్ని ఎవ్వరూ దాటలేరు ధర్మజా! ఆ విధి మాయప్రభావంచేత నేడు మీరు అరణ్యాలపాలయ్యారు రేపు కౌరవసంహారం జరిగిన నాడు మీరే కౌరవ సామ్రాజ్యాన్ని పాలిస్తారు ఇది సత్యం ' అని వక్కాణించాడు

ఆ విధి అంత బలియమైనదా, బావా?' అని అడిగాడు మహాబాహుబల పరాక్రమవంతుడైన భీమసేనుడు

శ్రీకృష్ణుడు నవ్వి 'విధి ఎంతటి బలీయమైనదంటే దాన్ని నియమించిన పరమశివుడుకూడా దానికి తలవంచక తప్పలేదు భీమసేనా ' అంటూ ఆ కధని వారికి వివరించాడు ఇలా

ఒకసారి, నవగ్రహాల్లో ఒకడైన శనిదేవుడు కైలాసానికి వెళ్లి సదాశివుడి దర్శనం చేసుకున్నాడు సదాశివుడు అతడి కర్తవ్యనిష్టని పరీక్షించగోరి 'శనీ నీ ధర్మ నిర్వహణ సక్రమంగా సాగుతోందా?' అని ప్రశ్నించాడు

శనిదేవుడు నమస్కరించి 'తమ అనుగ్రహం నాకున్నంతవరకూ ముల్లోకాల్లో నా విధి నిర్వహణకు అడ్డుపడగల మొనగాడు పుట్టడు మహాదేవా ' అన్నాడు గర్వంగా

శివుడు నవ్వి 'ఆహాః నువ్వంతటి మొనగాడివా? నిన్ను అడ్డుకోడానికి మరో మొనగాడు పుట్టాలా? ఏమి నేను చాలనా? నీ శక్తిని అడ్డుకోలేనా?' అని అడిగాడు

శని మరింత వినయంగా నమస్కరించి 'నాకున్న శక్తి యుక్తులన్నీ తమరు ప్రసాదించినవే గదా, సదాశివా మీరు నా విధి నిర్వహణకు కొన్ని ధర్మములు నియమించారు నేనా ధర్మానుసారం కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాను నాది ధర్మబద్ధమైన కర్తవ్యం కావున, క్షమించండి మహాదేవా నాకీ శక్తి ప్రసాదించిన మీరుకూడా నా శక్తి ప్రభావాన్ని అడ్డజాలరు అధిగమించ జాలరు ' అని తెలియపర్చాడు వినయంగా







పరమేశ్వరుడు ఆగ్రహాన్ని నటిస్తూ 'శనీ   ఏమి నీ పొగరుబోతు ప్రగల్భాలు   నువ్వంతటి ధీమంతుడవైతే నామీద నీ ప్రభావాన్ని చూపించి నీ శక్తి నిరూపించుకోగలవా?' అని సూటిగా ప్రశ్నించాడు

శని తలవంచి చేతులు జోడించి 'సాక్షాత్తూ పరమేశ్వరుడే నా శక్తిని పరీక్షించగోరితే కాదనగలనా, మహాదేవా  ? రేపు సూర్యోదయకాలమునుండి ఏడుఘడియల కాలం నేను తమర్ని పట్టుకుంటాను  ఈ అండపిండ బ్రహ్మాండ లోకాల్లో తమరు ఎక్కడవున్నా శని ప్రభావానికి లోను గాక తప్పదు  అసలు యీ విషయం విన్నవించుకోడానికే నేను తమరి దర్శనం చేసుకున్నాను ' అని చెప్పాడు

'సరే  అదీ చూద్దాం ' అన్నాడు సదాశివుడు చిరునవ్వుతో

ఈ విషయం ముల్లోకాలలోని ముక్కోటి దేవతలకీ తెలిసింది  శనిదేవుడు ఆ దేవదేవుని తోటే పందెంవెయ్యడం విశేషమైతే, దానికి సమ్మతించిన మహాదేవుడు శనిబారినుండి ఎలా తప్పించుకుంటాడో చూడాలన్న జిజ్ఞాస అందరికీ కలిగింది  ఆ మర్నాడు ఉషోదయకాంతులతో ఉదయించిన సూర్యుడు తన సహస్రాధిక కిరణాలతో ముల్లోకాలనూ ప్రకాశింపజేస్తూ ఆ వెలుగులో సదాశివుడు ఎక్కడున్నాడోనని త్రిభువనాలలో గాలించాయి  ఎక్కడా శివుడి జాడలేదు  శని కూడా కనిపించలేదు

సూర్యాది దేవతలంతా ఆశ్చర్య సంభ్రమాలతో శివుడు ఏమయ్యాడోనని విచారించ సాగారు వారికి ముల్లోకాల్లోనూ శివుని చూసినట్లు ఎవ్వరూ చెప్పలేకపోయారు  అయితే శివుడు ఏమయ్యాడు? ఎక్కడికి వెళ్లాడు? శని కనిపించదేం? అతను కూడా శివుడిని పట్టడానికి అదృశ్య రూపంలో ఆయన జాడకోసం వెతుకుతున్నాడా? ఆ పందెంలో ఎవరు గెలుస్తారు?

ఇలా ఆలోచిస్తూ దేవతలంతా నిరీక్షిస్తుండగానే శని చెప్పిన ఏడు ఘడియల కాలం పూర్తయింది అప్పుడు   అప్పుడు   ఒక మారేడు చెట్టుతొర్రలోంచి శివుడు బయటకి వచ్చి 'శనీ  ' అన్నాడు

'చిత్తం  మహాదేవా  ' అంటూ ఆ తొర్రలోంచే ప్రత్యక్షమై శివుడికి నమస్కరించాడు శని ముక్కోటి దేవతలూ విస్తుబోయి చూస్తున్నారు

'శనీ   నన్ను పట్టలేదేం?' చిరునవ్వుతో అడిగాడు శివుడు  శని నవ్వి 'నేను పట్టబట్టేకదా, ముల్లోకాలకూ ఏలికవైన తమరు కైలాసాన్ని వదిలి యీ మారేడు చెట్టు తొర్రలో యీ ఏడు ఘడియలపాటు దాక్కున్నారు?' అన్నాడు  బ్రహ్మాది దేవతలంతా విస్తుబోతూ హాహాకారాలు చేశారు  జగద్రక్షకుడైన శివుడినే శనిపడితే ఆతడిశక్తిముందు జగాలన్నీ తలవంచక తప్పదు కదా? సర్వేశ్వరుడికంటే శనిదేవుడే గొప్పవాడైనట్లే కదా? ఇది క్షంతవ్యమా?

'అయితే, శనీ, నువ్వు నన్ను పట్టినట్లేనా?' మళ్లీ అడిగాడు సదాశివుడు

'ఇప్పుడు కొత్తగా పట్టుకునేదేముంది మహాదేవా  ? మీ సంకల్పమేకదా నా యీ రూప విశేషాలు  లోకుల దృష్టిలో మీరు వేరూ, నేను వేరు అనిపిస్తున్నా నా ఉనికి, నా కారణం నా ప్రభావం సర్వం తమరి లీలా విశేషమే కదా  మీ ఛాయామాత్రపు మాయనే కదా  నేను మీలోనే నేనూ, నాలో మీరూ వున్నాము  ఇహ మిమ్మల్ని నేనెప్పుడు వదలి వున్నాను సర్వేశ్వరా! ఇప్పుడు కొత్తగా పట్టుకోడానికి? అంతా మాయ  మీ లీలామాయ ' అన్నాడు శని భక్తితో ఆతడి మాటలు విన్న ముల్లోకవాసులూ నివ్వెరపోయారు





సదాశివుడు నవ్వి 'సత్యం గ్రహించావు శని జగాలకి యీ సత్యాన్ని చాటడానికే నువ్వు నన్ను పట్టావన్న భ్రమ లోకాలకి కల్పించాను విధి బలీయమనీ అది పరమేశ్వరుడైనా దాటలేడని గ్రహించినప్పుడే సర్వజీవులు సత్కర్మ ధర్మాచరణకు బద్ధులవుతారు జీవుల పాప పుణ్యాలను బట్టే వారి విధివిధానం నిర్ణయమవుతుంది విది బలీయం ఎంతటివారైనా దాన్ని అనుభవించక తప్పదు ' అన్నాడు

బ్రహ్మాది దేవతలు తక్షణం పరమేశ్వరుని దర్శించి 'అయితే మహాదేవా విధి బలీయమై, శనిదేవుడి ప్రభావంకూడా తోడైతే జీవులు ఆ బాధలను తట్టుకోలేరు పాపపుణ్యాలనేవి అన్నీ వేళలా తెలిసి జరిగేవి కాదు కదా! కనుక దుర్భరమైన విధి, శని ప్రభావాల పాలైన జీవులకి, ఆ బాధలనించి విముక్తి పొందడానికి తరుణోపాయం ఉపదేశించండి ' అని ప్రార్థించారు

సర్వేశ్వరుడు నవ్వి 'తెలిసి ముట్టుకున్నా, తెలియకతాకినా అగ్ని కాలుతుంది కదా! విధి కూడా అంతే ఆ విధి ప్రభావంచేతనే ఎవరినైనా శని పట్టుకుంటాడు కానీ, తనకి తానుగా అతడు ఎవర్నీ బాధించడు అయినా, యీ సత్యాన్ని గ్రహించినవారు శనికి తైలాభిషేకం జరిపిస్తే అతడి ఉగ్రప్రభావం శాంతిస్తుంది సర్వేశ్వరుడినైన నన్ను అభిషేకాదులతో అర్చించి పూజిస్తే, శనిప్రభావంవల్ల వచ్చే బాధలను సులభంగా అనుభవించగలరు వారికి కష్టాల్లోనూ శుభమే జరుగుతుంది నాకూ, శనికీ బేధం లేదని చాటడానికి నేటినించీ ఈ శని శనీశ్వరుడుగా పిలవడతాడు నన్ను ఆరాధించిన వారికి, విధి బలీయమైనా దాని ప్రభావం అంతగా వుండక ఏల్నాటి శని దశల్లోనూ మేలు జరుగుతుంది కానీ, విధి బలీయం ఆ విధికి కారణం జీవులు ఆచరించే పాపపుణ్యాలని గ్రహించండి ' అను అనుగ్రహించాడు

శ్రీకృష్ణుడు యీ కథ చెప్పి 'అందుచేత ధర్మజా పూర్వజన్మ పాపపుణ్యాల కారణంగానే మీకు అరణ్యవాసం సంక్రమించినప్పటికీ, నా అనుగ్రహం లభించి యీ అరణ్యంలో క్షేమంగా, సుఖంగా వుండగలుగుతున్నారు ఆ విధి చేతనే కౌరవ పాండవ యుద్ధమూ జరగక తప్పదు నువ్వూ, జూదము నిమిత్తములే ' అని చెప్పాడు

అయితే మా కర్తవ్యాన్ని నిర్దేశించు పరమాత్మా?' అనడిగాడు ధర్మరాజు

'మీ ధర్మాన్ని మీరు త్రికరణశుద్ధిగా ఆచరిస్తూ ఆ సదాశివుని నిత్యం భక్తి శ్రద్ధలతో పూజించండి శివకేశవులకు బేధం లేకపోయినా ధర్మకర్మాచరణ తప్పదు అలాగే, అర్జునా యీ ఆరణ్యవాసం నీకూ చక్కటి అవకాశం నియమ నిష్టలతో శివుడి గురించి తపస్సుచేసి ఆయన్ని మెప్పించి పాశుపతాస్త్రాన్ని సంపాదించు ' అని హితబోధ చేశాడు శ్రీకృష్ణుడు పార్థుడు సంతసించి అప్పటికప్పుడే తపోదీక్ష వహించి శ్రీకృష్ణుని సలహా మేరకు తపస్సుకి అనువైన ప్రదేశంగా ఇంద్రకీలాద్రిని ఎంచుకుని అక్కడికి చేరి శివుడి గురించి తపస్సు ఆరంభించాడు

ఇంద్రకీలాద్రి పర్వతంమీద మహిషాసురమర్దని 'అమ్మవారు' స్వయంభువై వెలసి వున్నదనీ, ఆమెని దర్శించి అర్చించడానికి ముక్కోటి దేవతలూ అక్కడికి వచ్చి పోతుంటారనీ, అమ్మవారే స్వయంగా అక్కడ నెలకొని వుండటంచేత, దేవతలూ, మహర్షుల రాకపోకలచేతా ఆ పర్వతం పరమ పవిత్రమైనదని, అలాంటిచోట తపస్సు చెయ్యడంచేత మనోరథం త్వరగా నెరవేరుతుందన్న భావంతో అర్జునుడు అక్కడ చాలాకాలం తపస్సు చేశాడు పార్థుడి తపోదీక్షకి మెచ్చిన పరమేశ్వరుడు అతడిని పరీక్షించడానికి అమ్మవారితో సహా కోయదొర అవతారంలో ఇంద్రకీలాద్రిపై దిగాడు





పరమేశ్వరుడి ఆదేశానుసారం మాయారాక్షసుడు అడివిపందిలా మారి భయంకరంగా ఘీంకరించసాగాడు ఆ మృగంచేసే శబ్దాలకు తపోభంగమైన అర్జునుడు ఆగ్రహంతో లేచి, ధనుర్బాణాలు తీసుకుని అడవిపంది వెంటపడ్డాడు అది అర్జునుడి కంటపడినట్లే కన్పిస్తూ, అతడికి చిక్కకుండా పొదల్లో దూరి తప్పించుకుంటూ అతడిని ముప్పతిప్పలు పెట్టింది

అర్జునుడు చాలసేపు దాన్ని వెంటాడి, విసిగి వేసారిపోయాడు చివరికి ఒక పొదలో దాని అలికిడిని గ్రహించి శబ్దబేధిని ప్రయోగించాడు అదే సమయంలో మారువేషంలోవున్న శివుడు కూడా బాణప్రయోగం చేశాడు ఇద్దరి బాణాలు ఏకకాలంలో ఆ మాయామృగంలో దిగబడ్డాయి అది భయంకరంగా ఘర్జిస్తూ విలవిలతన్నుకుని ప్రాణాలు వదిలింది పార్థుడు పరమానందంతో దాన్ని సమీపించి స్వాధీనం చేసుకోబోయాడు అంతలో

'ఏయ్ ఆగాగు ఆ వేటనాది ' అంటూ ఉరుకులమీద పరిగెత్తుకొచ్చాడు కోయదొర

'కాదు నాది' అన్నాడు అర్జునుడు

ఈ కొండనాది యీ అడవినాది ఇక్కడున్న సమస్తానికీ ఏలికని నేను ఈ వేటనాది ' అన్నాడు కోయదొర

'ఈ చోటు నాది ఈ అమ్ము నాది దీన్ని వేటాడిన కండబలం నాది అంచేత యీ వేట నాది ' అన్నాడు అర్జునుడు పంతంగా ఇద్దరిమధ్యా మాటా మాటా పెరిగింది వేట ఎవరిదో తేల్చుకోడానికి చేతులుకలిపారు ఆ పోరులో సర్వేశ్వరుడితో సమవుజ్జీగా నిలిచిన నరుడు చివరికి ఆయన్ని శివుడిగా గుర్తించి సాష్టాంగపడ్డాడు అమ్మతో సహా అయ్యదర్శనమిచ్చాడు

'పార్థా నీ భక్తికి మెచ్చాను పరమేశ్వరుడితోనే పోరుకి తలపడ్డ నీ శక్తికి మెచ్చాను నీకు విజయాన్ని, పాశుపతాస్త్రాన్ని అనుగ్రహిస్తున్నాను నీవు నేటినుండి విజయుడు అన్న నామంతో కీర్తించబడతావు నీవు తపస్సుచేస్తూ నివశించిన యీ వాటిక నీ పేరిట 'విజయవాటిక'గా ప్రసిద్ధమవుతుంది ' అని వరమిస్తూ పాశుపతాస్త్రాన్ని పార్థుడికి ప్రసాదించాడు పరమేశ్వరుడు

'అర్జునా కాలక్రమంలో యీ విజయవాటిక పవిత్ర పుణ్యక్షేత్రమవుతుంది దుర్గమమైన, అబేధ్యమైన యీ ఇంద్రకీలాద్రిపై వెలసిన నేను 'దుర్గ'గా పిలవబడుతూ భక్తుల అభీష్టాలు తీరుస్తూ కలియుగాంతం వరకూ యిక్కడ నివశిస్తాను ఇంద్రకీలాద్రిపై నేనున్నంతకాలం జనులు నాతో పాటు నిన్నూ తల్చుకుంటారు ' అని వరమిచ్చింది అమ్మవారు

పార్థుని ప్రార్థనమేరకు ఆ తల్లి దుర్గాదేవిగా దర్శనమిచ్చింది ఆమె అద్భుతరూపాన్ని చూస్తూ పార్థుడు భక్తితో యిలా స్తోత్రం చేశాడు

**'సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధకే**
**శరణ్యే త్ర్యంబకే గౌరీ నారాయణి నమోస్తుతే.'**

పార్థుని స్తోత్రగానాలకు సంప్రీతి చెందుతూ, పార్వతీ పరమేశ్వరులు అతడిని ఆశీర్వదిస్తూ అంతర్ధానమాయ్యారు

ఆ విధంగా విజయుడి పేరుమీద ఇంద్రకీలాద్రి పర్వతం చుట్టూ ప్రక్కల ప్రాంతం యావత్తూ విజయవాటిక నగరంగా రూపుదిద్దుకుంది విజయుని గాథకు సంబంధించిన శిలాశాసనం యీ పర్వతంమీద ప్రతిష్టించబడింది కాలక్రమంలో యీ విజయవాటిక నగరాన్ని రాజధానిగా చేసుకుని ఎందరో ప్రభువులు యీ ప్రాంతాన్ని పాలించారు



అయితే ఇంద్రకీలాద్రి పర్వతం చెట్లూ, చేమలతో దుర్గమంగా వుండటంచేత, యీ అరణ్యాల్లో క్రూరమృగాలతోపాటు భిల్లులూ, కోయలూ, ఆటవికులూ నివశిస్తూ వుండటంచేత సామాన్య ప్రజానీకం ఎప్పుడోగానీ వచ్చి దుర్గమ్మవారిని దర్శించుకునేవారు కాదు అడవిజాతి ప్రజలే ఆమెకి పూజలుచేసి, జంతుబలులు నైవేద్యం సమర్పిస్తుండేవారు అప్పట్లో అమ్మవారికి ఆలయంకూడా వుండేది కాదు అయితే అమ్మవారి మహత్తు అంతటా వ్యాపించడంచేత ప్రజలు ఆమెనే ఆరాధ్యదేవతగా పూజిస్తుండేవారు అలా తనని భక్తితో నమ్మి ఆరాధించిన వారందరినీ ఆ తల్లి ఎన్నో విధాలుగా కాపాడి ఆదుకుంటుండేది

ఆ తల్లి మహత్మ్య ప్రభావంచేత విజయవాటిక ఒక పరగణాగా రూపొందింది అయితే అప్పటికి ఆమెని 'దుర్గాదేవి' 'దుర్గమ్మతల్లి' అనే పిల్చుకునేవారు 'కనకదుర్గ' అన్న పేరు అప్పటికింకా రాలేదు అమ్మవారికి 'కనకదుర్గ' అన్నపేరు రావడానికి కూడా ఒక చారిత్రిక గాధ వుంది ఇక్కడ లభించిన 'శిలాశాసనం' బట్టి ఆ కధ యిలా వుంది

## దుర్గమ్మ 'కనకదుర్గ' గా మారిన గాధ

క్రీ॥శ॥ 5,6 వ శతాబ్ద ప్రాంతంలో విజయవాటికను మాధవవర్మ పాలించేవాడు ఆ కాలంలో చిన్న చిన్న సంస్థానాలు ఎన్నో వుండేవి అప్పటికింకా విజయనగర సామ్రాజ్యం స్థాపించబడలేదు

మాధవవర్మ ప్రజలను కన్నబిడ్డల్లా చూస్తూ ధర్మబద్ధంగా పరిపాలన సాగించేవాడు ఆయన దుర్గమ్మని తమ కులదేవతగా ఆరాధించేవాడు ఆయన తరుచుగా అరణ్యమార్గం ద్వారా ఇంద్రకీలాద్రిని చేరుకుని అమ్మవారికి పూజాదికాలు జరిపిస్తుండేవాడు

ఆనాటి ప్రజలు అమ్మవారిని గ్రామదేవతగా భావించి ఆరాధిస్తుండేవారు అయితే అమ్మవారు రాత్రివేళల్లో తన మందిరాన్ని వదిలి, కొండదిగి వచ్చి గ్రామసంచారంచేస్తూ అర్ధరాత్రి దాటాక తిరిగి తన కొండకి తిరిగి వెళ్తుందని ప్రజలూ, ప్రభువూ నమ్మేవారు అప్పట్లో వారి నమ్మకాలకి అనేక నిదర్శనాలు కూడా జరిగాయి

అందుచేత స్థానిక ప్రజలు పగటిపూట మాత్రమే కొండెక్కి అమ్మవారిని దర్శించుకునేవారు పూజారికూడా చీకటి పడకముందే అర్చనలు ముగించుకుని కొండదిగి ఊళ్లోకి వచ్చేసేవాడు ఆటవికజాతులవారు ఎక్కువగా అమ్మని దర్శించుకుంటుండేవారు

మాధవవర్మకి చాలాకాలం వరకూ సంతానం కలగలేదు ఆయన నిత్యం తన భవనంలో అమ్మవారిని పూజిస్తూ తనకి సంతానం ప్రసాదించమని ప్రార్ధించేవాడు ఆయన ప్రార్థనలు ఫలించి ఒక రాత్రి అమ్మవారు ఆయనకి స్వప్నంలో దర్శనమిచ్చింది

'నాయనా నేను వశిస్తున్న ఇంద్రకీలాద్రి దుర్భేద్యమైనది పవిత్రమైనది అయినా నా భక్తులు నన్ను దర్శించుకోడానికి కనీస వసతి సౌకర్యాలు కూడా లేవు ఈ సంస్థానాన్ని పాలిస్తున్న ప్రభువుగా ఆ ఏర్పాట్లు చేయించు నీకు వంశాంకురాన్ని ప్రసాదిస్తాను ' అని స్వప్నంలో రాజుకి తెలియజేసింది దుర్గమ్మ

  

మాధవవర్మ చాలా ఆనందించాడు తనకున్నపాటి వనరులతో కొండకి మెట్లమార్గాన్ని నిర్మించాడు అమ్మవారి విగ్రహంపైన చిన్న ఆలయాన్ని, దాని ముందొక మంటపాన్ని కట్టించాడు అమ్మవారికి నిత్య ధూపదీప నైవేద్యాలకి గాను ఈనాములు ఏర్పాటు చేయించాడు సామాన్య ప్రజానీకం అమ్మవారిని దర్శించుకోవడానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేయించాడు అమ్మవారు కనికరించింది మాధవవర్మకి సలక్షణుడైన కుమారుడు జన్మించాడు ప్రజలూ ప్రభువూ ఎంతో ఆనందించి అమ్మవారికి ప్రత్యేకపూజలూ, అర్చనలూ చేశారు

యువరాజు క్రమక్రమంగా యుక్తవయస్కుడయ్యాడు అతడూ అమ్మవారి భక్తుడే అలా తండ్రీ కొడుకూ నిత్యం అమ్మవారిని సేవిస్తూ వుండేవారు మాధవవర్మ న్యాయమూ, ధర్మమూ తన రెండు కళ్లుగా భావిస్తే, యువరాజు న్యాయధర్మ పరిరక్షణలో తండ్రిని మించిన తనయుడిలా భాసించాడు యువరాజు రాజ్యాధికారం చేపడితే అలనాటి శ్రీరామచంద్రుడిలా రామరాజ్యం వస్తుందని ప్రజలు చెప్పుకునేవారు తన కొడుకుపట్ల ప్రజలకి వున్న నమ్మకం, ప్రేమా చూసి మాధవవర్మ మిక్కిలి సంతోషించేవాడు అలాంటి సుపుత్రుడిని తమకి ప్రసాదించిన అమ్మవారికి నిత్యం కృతజ్ఞతలు చెప్పుకునేవాడు రాజు ఇలా కాలం ఆనందంగా సాగుతుండగా విధి బలవత్తరమై ప్రజల్ని విషాదంలోముంచే సంఘటన ఒకటి ఊహించని విధంగా జరిగిపోయింది

ఒకరోజు ఒక పేదరాలు తన ఏడేళ్ల కొడుకుని వెంటబెట్టుకుని దుర్గమ్మకొండ సమీపంలో చింతచిగురు కోసుకోడానికి వెళ్లింది ఆమె తన పనిలో నిమగ్నమైవుండగా కొడుకు ఆ ప్రక్కనే ఆడుకోసాగాడు అంతలో సాయం సమయం కావచ్చింది చీకటిపడితే అమ్మవారు కొండదిగి సంచారానికి వస్తుందనీ, ఆ సమయంలో ఆమెకంట పడ్డవాళ్లు నెత్తురు కుక్కుకుని చస్తారని జనం చెప్పుకునేవారు అందుచేత పేదరాలు గబగబా తన పని ముగించుకుని చీకటి పడకుండా తన ఇంటికి చేరుకోవాలన్న ఆరాటంలో కొడుకుని వెంటబెట్టుకుని వడివడిగా నడవసాగింది తల్లికంటే ముందుగా ఆమె చెయ్యి వదిలించుకుని పరిగెత్తసాగాడు ఆ పసివాడు

'ఆగరా' అంటూ అరుస్తూ కొడుకుని మందలిస్తూ వెనుక నడవసాగిందా పేదరాలు అయితే ఆ పసివాడు తల్లి మాటలు వినిపించుకోకుండా దూకుడుగా ముందుకు పరిగెత్తి ఓ మలుపు తిరిగాడు

సరిగ్గా అదేసమయంలో అదే మార్గాన వెనకనించి తన రథంమీద వేగంగా దూసుకు వస్తున్నాడు యువరాజు

యువరాజు ఆ మలుపులో చాలా దురుసుగా, రెట్టించిన వేగంతో రథాన్ని నడిపాడు ఆ రథచక్రాల క్రిందనించి లేస్తున్న ధూళికి అతడికి మరేమీ కనిపించే అవకాశంలేదు రథ చక్రాలు, అశ్వాల పరుగుల చప్పుళ్లకి మరే శబ్దాలూ వినిపించే పరిస్థితీ లేదు

అలా అమితవేగంగా పరిగెడుతున్న ఆ రథఅశ్వాల ధాటికి అరుపులో ఆ పసివాడు తూలి క్రిందపడ్డాడు మరుక్షణం రథచక్రాలు ఆ బాలుడి దేహంమీదగా సాగిపోయాయి ఆ బాలుడి ఆక్రందన కూడా ఆ హోరులో వినిపించలేదు యువరాజు అది గమనించకుండా ముందుకు సాగిపోయాడు





అంతలో బాలుడి తల్లి అక్కడికి పరిగెత్తుకొచ్చింది రక్తపుమడుగులో కొనఊపిరితో గిలగిల తన్నుకుంటున్న కొడుకుని చూసి దుఃఖంతో గుండెలు బాదుకుంటూ కుప్పకూలిపోయింది

'బాబూ' అని విలపిస్తూ కొడుకుని వడిలోకి తీసుకుంది ఆ తల్లి ఆ బాలుడు 'అమ్మా అని ఏడుస్తూ తల్లివడిలో శాశ్వితంగా కన్నుమూశాడు ఆ తల్లి గుండె దుఃఖంతో చెరువై పోయింది

'అమ్మా దుర్గమ్మతల్లీ బిడ్డలులేరన్న నా చింతతీర్చి నాకు కొడుకుని ప్రసాదించావు ఇంతలోనే మళ్లీ నన్ను దిక్కులేనిదాన్ని చెయ్యడానికి నీ మనస్సెలా ఒప్పింది తల్లీ ' అని వాపోయింది

'నా కడుపులో యిలా ఎందుకు చిచ్చుపెట్టావమ్మా ' అంటూ గుండెలు బాదుకుని ఏడ్చింది కానీ ఆ తల్లి మొర ఎవరాలకిస్తారు? ఆమె కడుపుకోత ఎలా తీరుతుంది? ఆమె ఆక్రోశం కాస్తా ఆవేశంగా మారింది కొడుకు శవాన్ని భుజాన వేసుకుని రాజసభకి బయల్దేరింది

ఆ రాత్రి మాధవవర్మని న్యాయంకోరుతూ ధర్మగంట మోగించింది ఇప్పుడు వేళగానివేళ ఆ ధర్మ ఘంటారావం వినిపించేసరికి మాధవవర్మ తక్షణం సభ ఏర్పాటు చేయించాడు ధర్మ గంట మ్రోగించిన తల్లిని కొడుకు శవంతోసహా సభలో ప్రవేశపెట్టారు

మాధవవర్మ ఆ బాలుడి శవాన్ని చూస్తూనే తీవ్రంగా కలతచెంది 'ఎవరమ్మా నువ్వు? ఆ బాలుడెవరు? ఏం జరిగింది?' అనడిగాడు అనునయంగా

'ఘోరం జరిగింది మహారాజా ఒకడు నా ఒక్కగానొక్క కన్నబిడ్డని అతి దారుణంగా పొట్టన పెట్టున్నాడు నా కొడుకునిచంపి నన్ను జీవశ్చవాన్ని చేశాడు ప్రభూ 'అంటూ దుఃఖంతో బావురుమంది ఆ తల్లి సభకి చేరిన ఊరిజనం బిడ్డని పోగొట్టుకున్న యీ తల్లికి న్యాయం చెయ్యాలి ' అని అన్నారు

మాధవవర్మ వాళ్లని ఉద్దేశిస్తూ 'మా పాలనలో అధర్మానికి, అన్యాయానికి తావులేదు ఈ బాధితురాలికి తప్పక న్యాయం జరిపిస్తాం ' అని సభకి హామీయిచ్చి 'ధైర్యంగా చెప్పమ్మా నీ కుమారుడి మృతికి కారకుడెవరు?' అని అడిగాడు

ఈ దారుణానికి ఒడిగట్టింది ఎవరో నాకు తెలియదు ప్రభు, ఎవరో రదం తోలుతు రాజప్రాసాదంవైపు వెళ్లారు అని విన్నవించుకుంది

మాధవవర్మ ఆమె చెప్పిన వివరాల ప్రకారము ఆ శిశువును చంపిన వారిని ఎక్కడవున్నా బంధించి వెంటనే మరణదండన విధించమని ఆదేసించాడు

ఆ తరువాత వేగులద్వారా ఆ శిశువునికి ప్రమాదము జరిగినది తన కొడుకు వల్లనేనని తెలిసికొని, ప్రజలకొక న్యాయం, ప్రభువులకొక న్యాయంలేదని వెంటనే శిక్షను అమలు చేయమని ఆజ్ఞాపించాడు





మంత్రులు, సామంతులు, ప్రజలు ప్రభు మాకు అన్యాయం జరుగుతుంది మీకు లేక లేక కలిగిన ఏకైక సంతానము మీ తరువాత రాజ్యభారం వహించువారు ఎవ్వరూ లేరు యువరాజుని క్షమించమని అందరు విన్నవించుకున్నారు

కానీ మాధవవర్మ అలా వీలులేదు వెంటనే శిక్షను అమలు చేయమని ఆజ్ఞాపించాడు

ఆ మర్నాడు సూర్యోదయ సమయంలో అశేష జనసమక్షంలో యువరాజుకి బహిరంగంగా మరణదండన అమలు జరిపించాడు మాధవవర్మ

అప్పుడు ఒక్కసారిగా ఆకాశమంతటా తళతళమెరుపులు మెరిసింది ఆ మెరుపుల మధ్యనించి కనకవర్షం కురవసాగింది రాజూ, ప్రజలూ నిశ్చేష్టులై చూస్తుండగా నాలుగు ఘడియలపాటు కనకవర్షం కురిసింది

ఆ బంగారం వర్షంలా కురవడానికి దుర్గమ్మే కారణమని గ్రహించిన మాధవవర్మ 'తల్లీ దుర్గమ్మా నీ లీలలు తెల్సుకోవడం మా వంటి సామాన్యులకు ఎలా సాధ్యం? నువ్వు ప్రసాదించిన నా కుమారుడిని నువ్వే తీసుకున్నావు ఇప్పుడేమో అపార కరుణావృష్టి కురిపించావు 'ఏమిటమ్మా, నీ లీలలు?'' అని ప్రార్థించాడు

అప్పుడు అంతరిక్షంనుండి 'రాజా నీ ధర్మనిరతికి మెచ్చి కనకవర్షం కురిపించాను నీ భక్తికి మెచ్చి నీ కుమారుడికీ, ఆ పేదరాలి కుమారుడికీ ప్రాణదానం చేస్తున్నాను మీరూ మీ ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లండి' అని దేవి వాక్కు వినిపించింది యువరాజూ, ఆ బాలుడూ నిద్రలోంచి లేచిన వాళ్లలా మేలుకున్నారు

'తల్లీ దుర్గా కనకవర్షం కురిపించి మా పాలిట కనకదుర్గవయ్యావు నీ కరుణా కటాక్షలతో యీ విజయవాటికను కనకవాడగా మార్చావు జేజేలు తల్లీ జేజేలు ' అని ప్రార్థించారు రాజు, ప్రజలు

ఆ విధంగా, దుర్గాదేవి, ఆనాటినించీ 'కనకదుర్గ' అయింది అయితే ఆమె మూలవిరాట్ స్వరూపం మాత్రం 'మహిషాసుర మర్ధని' అవతారంగా వుండి ఉగ్రరూపంతో భీతి కొలుపుతూ వుండేది కాలక్రమంలో జగద్గురు ఆది శంకరాచార్యులవారు దేశాటన చేస్తూ 'విజయవాటిక'కి వచ్చారు పవిత్ర నదిలో స్నానమాచరించి ఇంద్రకీలాద్రిని చేరి కనకదుర్గమ్మని దర్శించుకున్నారు

శివుని వరప్రసాది అయిన శంకరులవారు ఉగ్రరూపిణి అయిన 'మహిషాసుర మర్ధని' మూర్తిని గాంచి విస్మయం చెందారు లోకాలను చల్లని చూపులతో కాపాడి కటాక్షించవల్సిన తల్లి 'తన బిడ్డలని భయపెట్టేలా' ఉగ్రరూపంతో వెలసివుండటంలోని ఆంతర్యం ఏమిటోనని వారు తమ దివ్యదృష్టితోచూసి మహిషాసుర సంహారం అనంతర వృత్తాంతాన్ని గ్రహించారు

ఆదిశంకరాచార్య ఆ 'మహిషాసుర మర్ధని'ని భక్తి ప్రపత్తులతో ఇలా కీర్తించారు



# మహిషాసుర మర్ధినీ స్తోత్రం

అయిగిరినందిని నందితమోదిని విశ్వవినోదిని నందినుతే
గిరివర వింధ్య శిరోఽధిని వాసిని విష్ణు విలాసిని జిష్ణునుతే
భగవతి హే శితికంఠ కుటుంబిని భూరికుటుంబిని భూరికృతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్మకపర్దిని శైలసుతే॥

సురవరవర్షిణి దుర్ధరధర్షిణి దుర్ముఖమర్షిణి హర్షరతే
త్రిభువన పోషిణి శంకరతోషిణి కల్మషమోచని ఘోరరతే
దనుజనిరోషిణి దుర్మదశోషిణి దుఃఖవినాశిని సింధుసుతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్మకపర్దిని శైలసుతే॥

అయిజగదంబి కదంబవనప్రియ వాస విలాసిని వాసరతే
శిఖరిశిరోమణి తుంగహిమలయ శృంగనిజాలయ మధ్యగతే
మధుమధురే మధుకైతవభంజిని కైటభభంజిని రాసరతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

అయినిజహుంకృతి మాతృనిరాకృతిధూమ్రవిలోచని ధూమ్రశిఖే
సమరవిశోణిత బీజసముద్భవ బీజజలతాధిక బీజలతే
శివశివకుంభ నిశుంభమహాహవ దర్పితభూత పిశాచపతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

అయిభో శతమఖఖండితకుండలి తుండిత ముండ గజాధిపతే
రిపుగజగండ విదారణఖండ పరాక్రమశౌండ మృగాధిపతే
నిజభుజదండ నిపాతితచండ నిపాతిత ముండ భటాధిపతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్య కపర్దిని శైలసుతే॥

అయిరణమర్మర శాత్రవదోర్ధుర దుర్జయ నిర్జర శక్తి భృతే
చతురవిచార ధురీణ మహాశివదూతకృత ప్రమధాది పతే
దురిత దురీహ దురాశయదుర్మద దానవదూత దురంత గతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

అయిశరణాగత వైరివధూవరకీరవరాభయ దాయకరే
త్రిభువనమస్తక, శూలవిరోధి నిరోధికృతామల తూలకరే
దుర్మ మితావర దుందుభినాద ముహూర్ముఖరీకృత దీనకరే
జయ జయహే మహిషాసుర మర్గిని రమ్యకపర్గిని శైలసుతే॥





సురలలనాతత థేయిత థేయిత తాళనిమిత్తజ లాస్యరతే
క కుంభాంపతివధోంగత తాలక తాలకుతూహల నాదరతే
ధిం ధిం ధిమికిట ధింధిమితధ్వని ధీరమృదంగ నినాదరతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

ఝుణ ఝుణ హీంకృత నూపుర రంజిత మోహిత శింజిత భూతపతే
నటిత నటార్ధ నటీనటనాయిక నాటిత నాటక నాట్యరతే
పదనత పాలిని ఫాలవిలోచని పద్మవిలాసిని విశ్వధురే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

దనుజసుసంగర రక్షణసంగ పరిస్ఫురదంగ నటత్కటకే
కనక నిషంగా పృషత్కనిషంగ రసద్భటభృంగ హటావటకే
హతి చతురంగ బలక్షితిరంగ ఘటద్బహురంగ వలత్కటకే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

మహిత మహోహవ మల్లమతల్లిక వెల్లకటిల్ల క భిక్షురతే
విరచిత వల్లిక పల్లిక గెల్లిక మల్లిక భిల్లిక వర్గభృతే
భృతి కృత పుల్లసముల్లసి తారుణ వల్లవతల్లజ సల్లలితే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

అయితవసుమనస్సు మనస్సు మనోహరకాంతిలసత్కల కాంతియుతే
సుతరజనీ రజనీ రజనీ రజనీ కరవక్త్ర విలాస కృతే
సునయనవరనయన సువిభ్రమరభ్రమర భ్రమరాధివిశ్వమతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

అవిరళగండల మేదురమున్మద మస్తకమతంగ రాజగతే
త్రిభువనభూషణ భూతకళానిధి రూపపయోనిధి రాజసుతే
అయి సుదతీజన లాలస మానస మోహన మన్మధ రాజగతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

కమలదళామల కోమలకాంతి కళాకలితాకుల బాలలతే
సకలకలానిచయక్రమకేళి చలత్కలహంస కులాలికులే
అళికుల సంకుల కువలయమండిత మౌళివిలత్సమదావికులే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

కలమురళీరవ వాజిత కూజితకోకిల మంజుల మంజురతే
మిళిత మిళింద మనోహర గుంభిత రంజితశైల నికుంజగతే
మృగగణభూత మహాశబరీగణ రింగణ సంభృతకేళిభృతే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

  

కటితటినీత దుకూల విచిత్ర మయూఖసురంజిత చంద్రకలే
నిజకనకాచల మౌళిపయోగత నిర్ఝరకుంజర భీరురుచే
ప్రణతసురాసుర మౌళిమణిస్ఫుర దంశుల తాధిక చంద్రరుచే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

విజితసహస్ర కరైక సహస్ర సుధాసమరూప కరైకమతే
కృతసుతతారక సంగర తారక తారకసంగర సంగమనుతే
గజముఖషణ్ముఖ రంజిత పార్శ్వ సుశోభిత మానస కంజపుటే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

పదకమలం కమలానిలయే పరివస్యతి యోనుదినంస శివే
అయికమలే విమలే కమలానిలశీకర సేవ్యముఖాబ్జ శివే
తవపదమధ్యహి శివదం దృష్టి పథం గతమస్తు మభిన్నశివే
జయ జయహే మహిషాసుర మర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥

స్తుతిమితి స్తిమిత స్తు సమాధినా నియమితో యతో 2 నుదినంపరేత్
పరమయారమయాసతు సేవ్యతేపరిజనో 2 పిజనోపిచతం భజేత్॥

***(ఇతి శ్రీ మచ్ఛంకరాచార్య విరచిత మహిషాసుర మర్దినీ స్తోత్రం)***

ఈ విధంగా కనకదుర్గాదేవిని కీర్తించిన శంకరాచార్యులవారు, పవిత్ర కృష్ణవేణీ జలాలతో శ్రీసూక్త విధానంగా దేవిని అభిషేకించి, ఇంద్రకీలాద్రిపైనున్న వృక్షాలనుండి శ్రీ గంధ చందనాలతో ఆ అమ్మవారికిమయి పూతనాలుపూసి, పలు పుష్పాలతో అర్చించి, నారికేళ, కదళీ ఫలాలను నివేదనగా సమర్పించి

**అరణ్యేరణే దారుణే శత్రుమధ్యే**
**నలే సాగరే ప్రాంతరే రాజగేహే**
**త్వ మేవా గతిర్దేవి నిస్తార నౌకా**
**నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే॥**

అని అమ్మని కీర్తించారు మహిషాసుర మర్ధనిగా ఉగ్రమూర్తిగావున్న మూలవిరాట్స్వరుపాన్ని శాంతింపచెయ్యడానికి, శాంతియంత్రాన్ని ప్రతిష్టించారు ఇలా శంకరులవారిచే శ్రీ చక్రం ప్రతిష్ట జరిగినందుకే అమ్మవారు నేటికి రాజరాజేశ్వరీ రూపంలో కనకదుర్గగా ఆనాటినించీ దర్శనమిస్తోంది. శంకరులవారే పసుపుచందనాలతో అమ్మముఖరూపాన్ని తీర్చిదిద్ది, సమయాచార పూజావిధాన పద్ధతి ఆరంభించి దేవిని ఇలా ప్రార్ధించారు

అదేవిధంగా

శంకరాచార్యులవారు తమ దివ్యదృష్టిచేత ఇంద్రకీలాద్రిపై అదృశ్యంగా వున్న 'బ్రహ్మప్రతిష్ఠిత శివలింగాన్ని' గుర్తించి ప్రార్ధించి, ఆ లింగమును వెలికితీసి పునఃప్రతిష్టచేసి మల్లికా పుష్పాలతో శివుని పూజించారు మల్లెపూలతో పూజలందుకొనడంచేత శివునికి 'మల్లేశ్వరుడు' అన్నపేరు వచ్చింది అమ్మవారికీ, అయ్యవారికి కళ్యాణం జరపడంచేత వారిని శ్రీ కనకదుర్గా మల్లేశ్వరులు అని కీర్తించడం సాంప్రదాయమైంది



అదే విధంగా అమ్మవారు రక్తబీజాది రాక్షసులను సంహరించి వారి రక్తపానంతో ఉగ్రరూపిణి అయినందున, ఆమెని శాంతింపచెయ్యడానికి కుంకుమ పూజ, కుంకుమార్చన జరపడం సాంప్రదాయమైంది 'మహిషాసుర మర్దని' కొండపై వెలసిన తరుణంలో ఏర్పడబోయిన ముప్పును తప్పించడానికి మంగళగౌరిగా అవతరించినందున గౌరికి ప్రీతికరమైన పసుపుతో మంగళగౌరిగా పూజించడం, ఇలా పసుపు కుంకుమలతో అమ్మవారిని పూజించి 'ముత్తయిదువతనం' వృద్ధికై స్త్రీలు ఆరాధించడం ఆచారమైంది అలాగే దుర్గని గాయత్రిగా అలంకరించడం గాయత్రిగా ఆరాధించడం కూడా ప్రాచుర్యంలోకి వచ్చింది

**కాత్యాయనీ చ విద్మ హే**
**కన్య కుమారి ధీ మహి**
**తన్నో దుర్గి ప్రచోదయాత్**

ఇలా 'దుర్గా గాయత్రి' ని నిత్యం పఠించి, అమ్మనే స్మరించేవారికి సకల సౌభాగ్య సంపదలూ సంప్రాప్తిస్తాయి

ఈ తల్లి త్రిశక్తి స్వరూపిణి త్రిమూర్తి స్వరూపిణి ఆనాటి విజయవాటికే కాలక్రమంలో విజయవాడగా అనంతరం బెజవాడగా, మళ్లీ విజయవాడగా మారింది కానీ అమ్మమాత్రం అప్పుడూ, ఇప్పుడూ ఎప్పుడూ తన భక్తులకి కొంగుబంగారమై, తనని నమ్మి కొలిచిన వారి మనోభీష్టాలు తీరుస్తూ చల్లగా కాపాడుతోంది ఈనాడు రాష్ట్రంనించేగాక దేశం నలుమూలలనించీ లక్షలాది భక్తులు తరలి వచ్చి అమ్మను దర్శించుకుంటున్నారు ఈనాడే కాదు శతాబ్దాల క్రితంనుంచీ ఎందరో వచ్చి అమ్మని దర్శించుకున్నట్లూ, ఆమె మహత్తులను ప్రత్యక్షంగా గమనించి తృప్తి చెందినట్లూ చారిత్రకాధారాలు, శిలాశాసనాలు ఎన్నో వున్నాయి

## దేవి నవరాత్రి ఉత్సవాలు

ప్రతిసంవత్సరం ఆశ్వయుజశుద్ధపాడ్యమి మొదలుకొని దశమివరకూ శ్రీకనకదుర్గాంబకి నవరాత్రి మహోత్సవాలు ఘనంగా, రంగరంగ వైభవంగా ఇక్కడ జరుపుతుంటారు మొదటి తొమ్మిదిరోజులూ అమ్మవారిని తొమ్మిది అవతారమూర్తులుగా అలంకరించి ప్రతి అవతారానికి విశేష పూజలు, అర్చనలు జరుపుతారు దశమినాడు శ్రీ రాజరాజేశ్వరిగా కనకదుర్గాదేవిని అలంకరించి అర్చిస్తారు అశేష ప్రజానీకం యీ నవరాత్రి ఉత్సవాలలో పాల్గొని తరిస్తారు

## అమ్మవారి నౌకా విహారం

దశమినాటి సాయంత్రం అమ్మవారి ఉత్సవమూర్తిని ఊరేగింపుగా కృష్ణవేణీ నదీ తీరానికి తీసుకువెళ్తారు అనేకరకాల పుష్పాలతో అందంగా అలంకరించిన 'హంసవాహనం' మీద అమ్మవారిని, అయ్యవారిని మంత్ర,శాస్త్రబద్ధంగా ఆశీనులను గావించి నౌకావిహారం జరుపుతారు విద్యుద్దీపకాంతులతో, బాణాసంచా సంరంభాలతో సాగే యీ నౌకా విహారాన్నిచూసి తరించాలేగానీ మాటలలో వర్ణించడం సాధ్యంకాదు



## జమ్మి కొట్టడం

దశమినాటిరాత్రి జమ్మిదొడ్డిలో జమ్మికొడతారు పారువేట జరుగుతుంది దేశద్రోహులూ, ప్రజాద్రోహులూ అయిన శత్రువులను జయించినదానికి గుర్తుగా జమ్మి కొడతారు విజయవాడ వన్‌టౌన్ పోలీసులు యీ ఉత్సవానికి నాయకత్వం వహిస్తారు అమ్మవారిని సకల లాంఛనాలతో కొండపైనించి ఊరేగింపుగా జమ్మిదొడ్డికి తీసుకువచ్చి అక్కడ ఉత్సవం చేస్తారు ఈ పోలీసువారి సాంప్రదాయానికి వెనుక ఒక ఇతిహాసం వుంది

దాదాపు 70, 80 సంవత్సరాలక్రితం అప్పటి విజయవాడ వన్‌టౌన్ పోలీసు సబిన్‌స్పెక్టర్ ఏదోకారణంచేత అమ్మవారిని దూషించాడట ఆ మరుక్షణమే అతనికీ, అతని భార్య, నలుగురు పిల్లలకి తీవ్రమైన జ్వరంవచ్చి మశూచి సోకింది ఆయన తన తప్పు తెలుసుకుని అమ్మవారికి అపరాధ సహస్రాణి చెప్పుకున్నాడు అంతే ఎలా వచ్చిన మశూచి అలా మాయమైపోయింది ఆయన అమ్మవారిసేవలో భాగంగా ఆ సంవత్సరం పారువేటలో తన స్టేషన్ సిబ్బందితో సహా పాల్గోన్నాడు అప్పటినించీ 'జమ్మికొట్టడం' అనేది వన్‌టౌన్ పోలీసులకి ఆచారమైంది ఆ స్టేషన్ సబిన్‌స్పెక్టర్‌ది నాయకత్వ సాంప్రదాయమైంది నేటికీ యీ ఆనవాయితీ పాటించబడుతోంది

## భవానీ దీక్ష

బ్రహ్మశ్రీ రాచకొండ కామేశ్వర శర్మగారిచేత దాదాపు 40 సంవత్సరాల క్రితం 1979–80 సం॥రాల్లో యీ భవానీదీక్ష ప్రారంభించబడింది ఈ గ్రంథంలో ఉదహరించిన 'అమ్మవారి' అనేక లీలావిశేషాలు, పౌరాణిక, చారిత్రికాంశాలు మాకు వివరంగా తెలియపర్చి యీ గ్రంధరచనకు తమ సహకార ప్రోత్సాహాలందించిన 'బహ్మశ్రీ రాచకొండ కామేశ్వర శర్మ'గార్కి మా హృదయపూర్వక కృతజ్ఞతలు ఈదంపతులకు శ్రీ కనకదుర్గమ్మవారు సకల ఐశ్వర్య ఆయురారోగ్య సౌభాగ్యాలను ప్రసాదించాలని మనసారా ప్రార్ధిస్తున్నాము

కనుక పరమపవిత్రమూ, పావనమూ, త్రిలోకపూజ్యమూ, అయిన 'అమ్మలగన్నమ్మ', 'చాలపెద్దమ్మ' యీ సృష్టికే 'అమ్మ' అయిన విజయవాడ శ్రీ కనకదుర్గమ్మను దర్శించి, అర్చించి, తరించిన వారిదే భాగ్యం ఈ తల్లి అపరాజిత కోర్కెలు తీర్చే కామేశ్వరి ఆకలితీర్చి అన్నంపెట్టే అన్నపూర్ణ విద్యలనొసంగే సరస్వతి విజ్ఞాన జ్ఞాన ప్రదాయిని గాయత్రి అష్ట ఐశ్వర్యాలనూ ప్రసాదించే మహాలక్ష్మి ¸ స్త్రీలకు సంతానాన్ని, సౌభాగ్యాన్ని ఐదవతనాన్ని ప్రసాదించే మంగళగౌరి దుష్టశక్తులను దునుమాడే దుర్గ, కాళి, చండి, చాముండి, శాంభవి, త్రిపురసుందరి, శ్రీ లలిత అన్నీ యీ తల్లి అవతారరూపాలే సుప్రసిద్ధ వాగ్గేయకారులైన నారాయణతీర్ధులు వారు పాడిన తరంగం **జయజయ వైష్ణవి దుర్గే జయ జయ కల్పితసర్గే** అన్న పాదం యీ తల్లి లీలాస్తుతికి అక్షరసత్యం

'హేదుర్గే విజయదుర్గే కాంచనదుర్గే శరణు శరణు ' అంటూ మనమూ శ్రీ కనకదుర్గాదేవిని స్మరిద్దాం ప్రార్ధిద్దాం పూజిద్దాం తల్లి దీవెనలు అందుకుందాం సకల సంపత్ సౌభాగ్యాలతో చిరకాలం వర్ధిల్లుదాం








శ్రీ లలితా త్రిపుర సుందరి దేవి

శ్రీ కనకదుర్గమ్మవారిని ఎందరో రాజులు, చక్రవర్తులు, విదేశీయులు, కవి, గాయక వైతాళికు లెందరో దర్శించి పూజించి భూరి విరాళాలు, ధన కనక వస్తు వాహన సంపత్తులు సమర్పించినట్లు ఇక్కడ లభించిన శిలాశాసనాలు, బంగారు వెండి నాణాలనుబట్టి తెలుస్తోంది

బౌద్ధయుగంలో బోధి సత్త్వ మైత్రేయుడు, భావవివేకుడు, ఆచార్య నాగార్జునుడు తదితర బౌద్ధ గురువులు,కొండకుందా చార్యులు, అగ్గలయ్యవంటి జైన మతాచార్యులు అమ్మని దర్శించారు. రోమనులు, క్షత్రీయులు, పల్లవులు ఇంకా అనేక రాజవంశాలకి చెందినవారు కనకదుర్గని దర్శించినట్లు ఇక్కడ తవ్వకాల్లో లభ్యమైన బంగారు నాణాలనిబట్టి తెలుస్తోంది విజయనగరా ధీశుడు శ్రీ కృష్ణదేవరాయలు కొండపల్లి ముట్టడించడానికి వెళ్తూ ఈ తల్లిని దర్శించి అర్చించినట్లు, ఎన్నో అమూల్యమైన కానుకలు సమర్పించుకుని అమ్మవారి అనుగ్రహంతో విజయాన్ని సాధించినట్లు ఇక్కడవున్న శాసనాలద్వారా తెలుస్తోంది హుయాన్‌త్సాంగ్, ఫాహియాన్‌వంటి విదేశీయాత్రికులు అమ్మవారిని దర్శించి అనేక విశేషాలను తమ గ్రంధాల్లో అక్షరబద్ధం చేశారు

బుద్ధుని అవతారంగా భావించబడే మంజుశ్రీ యీ నగరానికి వచ్చినప్పుడు ధ్యానంలో ఆయనకి అమ్మవారు 'తారాదేవి' గా దర్శనమిచ్చింది ఆయన ధ్యానంలో వుండగా మన్మధుడు ఆవహించాడు తనకు అలా వికారం కలిగించిన మన్మధుడిని శమధం, విపశ్యన యోగాలద్వారా బండరాయి కమ్మని శపిస్తాడు ఇకపై కొండపై ధ్యానంచేసే యోగులకి మన్మధబాధ దాపురించదని ఆయన భావితరాల వారిని అనుగ్రహిస్తాడు ఈ ఉదంతం మంజుశ్రీ మూలకల్పం మారదమన సూత్రాలలో లిఖించబడింది.

ఇంద్రకీల పర్వతపాదాలవద్ద కనకదుర్గ మంటప స్థంభంపై క్రీ శ 1232వ సంవత్సరం నాటి శిలాశాసనం ఒకటి కనిపించింది ఇది పద్దెనిమిది పంక్తుల్లోవున్న శిలాశాసనం ఆ కాలంలో కన్యా బృహస్పతి సంవత్సరంలో మేషసంక్రాంతి పర్వదినాన పల్లెమాంకబోయని కుమారుడైన మల్లెబోయుడు మహాభక్తుడైన శివయోగి మాదయకు 25 ఆవులను దానంచేసి, వాటి పోషణభారం తన పుత్రపౌత్రం పరంపరగా సాగుతుందని శాసనంచేశాడు ఈ శివయోగి నిరాహారంతో అనేక సంవత్సరాలపాటు యిక్కడ తపస్సు చెయ్యడమేగాక శ్రీ కనకదుర్గా మల్లేశ్వర స్వామివార్ల కళ్యాణం జరిపించినట్లు కూడా యీ శాసనం తెలుపుతోంది,

విజయనగరం సంస్థానాధీశులైన పూసపాటి ఆనందగజపతి ప్రతిసంవత్సరం దేవీ నవరాత్రులలలో రహస్యోక్తి ప్రకారం అమ్మవారికి పూజలు జరిపేవారు వీరు 1884 వ సంవత్సరంలో రోజుకి ఒక శ్లోకంచొప్పున పదిరోజుల్లో అమ్మవారిపై పదిశ్లోకాలు చెప్పారు వీరి దుర్గాస్తుతిని మండ లక్ష్మీకామశాస్త్రి అనే పండితుడు అనువదించి తెలుగులో పదిపద్యాలు చెప్పారు

అలాగే 13వ శతాబ్దంలో అప్పటి శృంగేరి పీఠాధిపతి శ్రీ విద్యాశంకర భారతివారు అమ్మవారిని దర్శించి, పులకించి, భక్తిభావంతో తన్మయులవుతూ, 'శ్రీకనకదుర్గానందలహరి' అనే స్తోత్రాన్ని ఆశువుగా చెప్పారు వారుచెప్పిన ఆ స్తోత్రంలోని 'సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధకే శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే . ' అనే శ్లోకాన్ని ఆబాలగోపాలం పఠిస్తుంటారు.







శ్రీ కనకదుర్గమ్మవారి దివ్యలీలావిలాసాలను చాటిచెప్పే ఒక అద్భుతసంఘటన 18వ శతాబ్దంలో జరిగింది ఆ కాలంలో వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు యీ ప్రాంతాన్ని పాలించాడు ఆయన ఆస్థానకవి ములుగు పాపయారాధ్యులు వారు నిత్యం కృష్ణానదిలో స్నానమాచరించి అమ్మవారిని దర్శించుకునేవారు ఒకనాడు ఆయన స్నానసంధ్యాదులు పూర్తి చేసుకుని కాస్తంత ఆలశ్యంగా అమ్మవారి దర్శనానికి వచ్చారు అప్పటికే కాలాతీతమవడంతో అర్చకులు ఆలయ ద్వారాలు మూసుకుని వెళ్లిపోయారు దేవీదర్శనం కానిదే పచ్చిగంగైనా ముట్టని ఆరాధ్యులవారు అమ్మవారి దర్శనం లభించలేదన్న ఆవేదనతతో 'ముక్తి ద్వారము తలుపు తీయగదవే చాముండా జగజ్జీవనీ ' అంటూ 24 పద్యాలు చెప్పారు వారు ఇరవైనాలుగవ పద్యం చెప్పగానే ఆలయం తలుపులు వాటంతటవే భళ్లున తెర్చుకున్నాయి అమ్మవారి దర్శనమైంది

ఆ ఉదంతం ఆనోటా ఆనోటాపడి రాజావారికి చేరింది ఆయన ఆ ఉదంతంలోని నిజా నిజాలనూ, ఆరాధ్యులవారి భక్తి తత్పరతను స్వయంగా పరీక్షించాలనుకున్నారు ఆ మర్నాడు రాజావారి ఆదేశానుసారం పూజారులు ముందుగానే ఆలయద్వారాలు మూసివేశారు ఆరాధ్యులవారు యధావిధిగా వచ్చి ఆలయద్వారాలు మూసివుండటంతో ఆవేదనలతో మళ్లీ ఆ ఇరవై నాలుగు పద్యాలూ చెప్పారు ఇరవై నాలుగో పద్యం చెప్పగానే మళ్లీ ఆలయం తలుపులు భళ్లున తెరుచుకున్నాయి ఆరాధ్యులవారితోపాటు, వారిని చాటునించి గమనిస్తున్న రాజావెంకటాద్రి నాయుడిగారికీ, వారితోపాటువిన్న చార్లెస్‌విట్‌మన్ అనే తెల్లదొరకీ అమ్మవారి దర్శనం లభించింది విట్‌మన్‌దొర ఆనందాశ్చర్యాలతో పులకితుడవడమే గాక తాను కళ్లారా దర్శించిన ఆ సంఘటనని వివరిస్తూ బ్రిటీష్ ప్రభుత్వానికి వివరంగా ఒక నివేదిక పంపించాడు అష్టభాషా చక్రవర్తి కీ॥శే॥ దివి నరసింహాచార్యులవారు తమ 'మహాభక్తులు' అన్న గ్రంధంలో యీ ఉదంతాన్ని పేర్కొన్నారు

'అంబా పలుకు', 'బెజవాడ కనకదుర్గా పలుకు ' అంటూ కవిగాయక వైతాళికులెందరో అమ్మవారిని వేనోళ్ల స్తుతించారు కీర్తించారు ఇలాంటి అమ్మవారి దివ్యలీలా విభూతులెనెన్నో ఎన్నెన్నో ఇప్పటికీ భక్తిశ్రద్ధలతో అమ్మవారిని కొలిచినవారికి ఆ తల్లిలీలలు అనుభవవేద్య మవుతున్నాయి భక్తిరస మందార సుగంధ పరిమళాలు భక్తులను అలరించి తరింపజేస్తున్నాయి

## శ్రీ దుర్గా సప్త శ్లోకీ

***శ్రీ శివ ఉవాచ:-***

దేవి త్వం భక్తి సులబే సర్వకార్య విధాయిని
కలౌ హి కార్య సిద్ధ్యర్థం ముపాయం బ్రూహియత్నతః

***దేవ్యువాచ:-***

శృణు దేవ ప్రవక్ష్యామి కలౌ సర్వేష్టసాధనం
మయా తవై వస్నే హేనా ప్యంబాస్తుతిః ప్రకాశ్యతే
ఓం అస్య శ్రీ దుర్గా సప్త శ్లోకి స్తోత్ర మంత్రస్య నారాయణోఋషిః
అనుపచంధః శ్రీ మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యో దేవతాః
శ్రీ దుర్గాదేవి ప్రీత్యర్థం సప్తశ్లోకీ దుర్గాపారే వినియోగః



ఓం జ్ఞానినా మపి చేతాంసి దేవీ భగవతీ హి సా ।
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి ॥ 1
దుర్గే స్మృతా హరసిభీతి మశేషజంతోః ।
స్వస్థైః స్మృతా మతి మతీవశుభాం దదాసి ॥
దారిద్ర్యదుఃఖ భయహారిణి కా త్వదన్యా ।
సర్వోపకార కరణాయ సదార్ద్ర చిత్తా ॥ 2
సర్వమంగళమాంగల్యే శివే సర్వార్థసాధకే ।
శరణ్యే త్ర్యంబికే దేవి నారాయణి నమోస్తుతే ॥ 3
శరణాగతదీనార్త పరిత్రాణ పరాయణే! ।
సర్వస్యార్తి హరే దేవి నరాయణి నమోస్తుతే ॥ 4
సర్వస్వరూపే సర్వేశే సర్వశక్తి సమన్వితే ।
భయేభ్య స్త్రాహినోదేవి! దుర్గేదేవి నమోస్తుతే ॥ 5
రోగా నశేషా నపహంసి తుష్టా ।
రుష్టా తు కామా సకలా నభీష్టా ॥
త్వా మాశ్రితానాం న విపన్నరాణాం ।
త్వా మాశ్రితా హ్యాశ్రయతాం ప్రయాంతి ॥ 6
సర్వబాధా ప్రశమనం త్రైలోక్య స్యాఖిలేశ్వరి ।
ఏవమేవ త్వయాకార్య మస్మద్వైరి వినాశనం ॥ 7

## శ్రీ దుర్గాష్టోత్తరశతనామావళిః

ఓం దుర్గాయై నమః
ఓం శివాయై నమః
ఓం మహాలక్ష్మ్యై నమః
ఓం మహాగౌర్యై నమః
ఓం సర్వలోకేశాయై నమః
ఓం సర్వకర్మ ఫలప్రదాయై నమః
ఓం సర్వతీర్థమయాయై నమః
ఓం పుణ్యాయై నమః
ఓం దేవయోనయే నమః
ఓం అయోనిజాయై నమః
ఓం భూమిజాయై నమః
ఓం నిర్గుణాయై నమః
ఓం ఆధారశక్త్యై నమః
ఓం మహామత్రే నమః
ఓం కోటిసూర్యసమప్రభాయై నమః
ఓం దేవతాయై నమః
ఓం వహ్నిరూపాయై నమః
ఓం సరోజాయై నమః
ఓం వర్ణరూపిణ్యై నమః
ఓం గుణాశ్రయాయై నమః
ఓం గుణమధ్యాయై నమః
ఓం గుణత్రయ వివర్జితాయై నమః
ఓం కర్మజ్ఞానప్రదాయై నమః
ఓం కాంతయై నమః
ఓం ధర్మజ్ఞానాయై నమః
ఓం ధర్మనిష్ఠాయై నమః





ఓం అనీశ్వర్యై నమః
ఓం నిర్గుణాయై నమః
ఓం నిరహంకారయై నమః
ఓం సర్వగర్వ విమర్దిన్యై నమః
ఓం సర్వలోకప్రియాయై నమః
ఓం వాణ్యై నమః
ఓం సర్వవిద్యాధిదేవతాయై నమః
ఓం పార్వత్యై నమః
ఓం దేవమాత్రే నమః
ఓం వనీశాయై నమః
ఓం వింధ్యవా సిన్యై నమః
ఓం తేజోవతై నమః
ఓం వహ్నిరూపాయై నమః
ఓం సరోజాయై నమః
ఓం వర్ణరూపిణ్యై నమః
ఓం గుణాశ్రయాయై నమః
ఓం గుణమధ్యాయై నమః
ఓం గుణత్రయవివర్జితాయై నమః
ఓం కర్మజ్ఞానప్రదాయై నమః
ఓం కాంతయై నమః
ఓం ధర్మజ్ఞానాయై నమః
ఓం ధర్మనిష్ఠాయై నమః
ఓం సర్వకర్మ వివర్జితాయై నమః
ఓం కామాక్ష్యై నమః
ఓం కామసంహర్త్ర్యై నమః
ఓం కామక్రోధవివర్జితాయై నమః
ఓం శాంకర్యై నమః
ఓం శాంభవ్యై నమః
ఓం శాంతాయై నమః
ఓం సుజయాయై నమః
ఓం జయభూమిష్ఠాయై నమః
ఓం జాహ్నవ్యై నమః
ఓం జనపూజితాయై నమః

ఓం సర్వకర్మ వివర్జితాయై నమః
ఓం కామాక్ష్యై నమః
ఓం కామసంహర్త్ర్యై నమః
ఓం కామక్రోధవివర్జితాయై నమః
ఓం శాకర్యై నమః
ఓం శాంభవ్యై నమః
ఓం సుజయాయై నమః
ఓం జయభూమిష్ఠాయై నమః
ఓం జాహ్నవ్యై నమః
ఓం జనపూజితాయై నమః
ఓం శాస్త్రాయై నమః
ఓం శాస్త్రమయాయై నమః
ఓం శాస్త్రాయై నమః
ఓం శాస్త్రమయాయై నమః
ఓం నిత్యాయై నమః
ఓం శుభాయై నమః
ఓం చంద్రార్ధమస్తకాయై నమః
ఓం భారత్యై నమః
ఓం భ్రామర్యై నమః
ఓం కల్పాయై నమః
ఓం కరాళ్యై నమః
ఓం కృష్ణపింగళాయై నమః
ఓం బ్రహ్మ్యై నమః
ఓం నారాయణ్యై నమః
ఓం రౌద్ర్యై నమః
ఓం చంద్రామృతపరివృతాయై నమః
ఓం జ్యేష్ఠాయై నమః
ఓం ఇందిరాయై నమః
ఓం మహామాయాయై నమః
ఓం జగత్సృష్ట్యధికారిణ్యై నమః
ఓం బ్రహ్మాండకోటి సంస్థానాయై నమః
ఓం కామిన్యై నమః
ఓం కమలాలయాయై నమః
ఓం కాత్యాయన్యై నమః





